# అపరాధ పరిశోధన

రూ. 4'50 ఏప్రిల్ '81

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—88

# నాలుగు నవలలు

30/3/81

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ప్రేమపిపాసి

రచన: వాణిశ్రీ

## తిరిగివచ్చిన దొంగ

రచన : సికిందర్

## చెల్లెలు పెళ్లి

రచన : టెంపోరావ్

## ఓ చపటు కథ

రచన: వసుంధర

పొగమంచు—పదహారవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ – 88
ఏప్రెల్, 1981
వెల: రు. 4-50

ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. పీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ప్రేమ పిపాసి?

వాణిశ్రీ

"ఎవరు మీరు?" ప్రశ్నించాడు శ్యాంప్రసాద్.

"'వాట్ ఈజ్ ఇండియా' మాగ్జయిన్ రిపోర్టర్ని."

"ఏం కావాలి మీకు?"

"మీ కథ కావాలి."

నవ్వాడు శ్యాంప్రసాద్.

"నేను రచయితను కాను."

"అక్కర్లేదు."

"ఎలా మరి?"

"మీరు చెప్తుంటే చాలు. నేను ఫాలో అవుతాను. మా మాగ్జయిన్‌లో మీ కథ సీరియల్‌గా పడుతుంది. మాకు ప్రపంచంలో అన్ని దేశాలలోనూ ఏజెన్సీలు వున్నాయి."

శ్యాంప్రసాద్ ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" ప్రశ్నించాడు రిపోర్టర్.

"ఏంలేదు. అందువల్ల లాభం ఏమిటని?"

"మీరు వూరికే చెప్పనక్కర్లేదు. మీ కథ సీరియల్ గా పడుతూనే ప్రపంచ వ్యాప్తంగా సంచలనం కలిగిస్తుంది. అమెరికా, లండన్ నుంచి పబ్లిషర్స్ వచ్చి మీ ముందు వాలారు. కొన్ని లక్షలు లాభం మీకు."

"నో.... నేను డబ్బు గురించి ఆలోచించడంలేదు."

"మరి ఏమిటి మీ సందేహం?"

"నా కథ చదివి ఎవరైనా నాలా ప్రవర్తిస్తే?"

"అలా ఎందుకు ఆలోచిస్తున్నారు? మీ కథ కొన్ని లక్షలమంది చదువుతారు. వారంతా ఎడ్యుకేట్ అవుతారని ఎందుకు ఆలోచించరు?"

శ్యాంప్రసాద్ సంతృప్తిగా చూశాడు.

"ఆల్ రైట్ నా కథ చెప్తాను" అన్నాడు.

"థాంక్స్" అన్నాడు రిపోర్టర్.

## 2

"మా నాన్న మన పెళ్ళికి ఒప్పుకోవడంలేదు" అంది స్వర్ణ.

"ఎందుకని?"

"నువ్వు డబ్బు లేనివాడివని."

"నువ్వు ఏం చేస్తావ్?"

"నేనేం చెయ్యగలను?"

"ప్రేమ కోసం ఏమీ చెయ్యలేవా?"

"ఏం చేసినా నేల విడిచి సాము చెయ్యను."

"అక్కర్లేదు. మనం ఎక్కడైనా వెళ్ళిపోదాం. నిన్ను సుఖపెడతాను స్వర్ణా!"

స్వర్ణ నవ్వింది.

"ఈ మేడలు, కార్లు వదిలి నీ వెంట వచ్చి నేనేం సుఖపడతాను శ్యాం?"

"అయితే నీ ప్రేమంతా బూటకం అన్నమాటే గా?"

"కానే కాదు. నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను."

"మరింకేమిటి నీ అభ్యంతరం?"

"మన పెళ్ళికి మా నాన్న ఒప్పుకోక పోవడమే!"

"పెళ్ళి మీ నాన్నే చెయ్యనక్కర్లేదు. మనమైనా చేసుకోవచ్చు రిజిస్ట్రార్ ఆఫీసులో."

"ప్రేమ వేరు, పెళ్ళి వేరు శ్యాం."

"నువ్వు నాకు దక్కకపోతే నేను బ్రతకలేను స్వర్ణా! నేను ఆత్మహత్య చేసుకుంటాను."

"అది పిరికివాళ్ళ లక్షణం."

"బ్రతికి సాధించేది ఏముంది?"

"మా నాన్నలా డబ్బు సంపాదించు."

"డబ్బు సంపాదించడం గొప్పకాదు. మానాభిమానాలు కోల్పోయి, మోసాలు, వంచనలు చేసి, అడ్డొచ్చినవాడిని మట్టుపెడుతూ ఎంతైనా సంపాదించొచ్చు."

"మా నాన్న డబ్బు అలాగే సంపాదించాడా?"

"అక్షరాలా!"

"అయితే నువ్వూ అలాగే సంపాదించు."

"స్వర్ణా!"

"అవును శ్యాం. డబ్బు ఎలా సంపాదించావని ఎవరూ అడగరు. డబ్బు సంపాదించావా లేదా? అనేది కావాలి లోకానికి."

"నేను డబ్బు సంపాదించే దాకా నువ్వు ఆగుతావా?"

"రెండు సంవత్సరాలు ఆగుతాను. నీ కోసం ఎదురు చూస్తాను. ఈ రోజు జనవరి ఒకటి. వచ్చే జనవరి ఒకటి

గాక ఆపై జనవరి ఒకటి నీకు ఆఖరి రోజు."

"ఓ.కె."

"అంతదాకా నన్ను కలుసుకోవడానికి ప్రయత్నించకు."

"నిన్ను చూడకుండా వుండగలనా స్వర్ణా?"

"పిచ్చి శ్యాం! విరహంలోనే సుఖం వుందన్నాడో కవి" నవ్వింది స్వర్ణ.

స్వర్ణ కోసం, ప్రేమ కోసం నేను డబ్బు సంపాదించాలి. ఏం చేసి డబ్బు సంపాదించాలి? మోసం, కుట్ర, దగా, హత్య....ఏదైనా చేసి సంపాదించాలి.

ఈ లోకంలో మనిషికి విలువలేదు. ఆ సంగతి చూచాయగా తెలిసినా స్వర్ణ స్పష్టంగా తెలియజేసింది.

నేను ఎత్తుగా వుంటాను. ఎర్రగా వుంటాను. అందంగా వుంటాను. కసరత్తుచేసి కండలు పెంచి ఆరోగ్యంగా వుంటాను.కొన్ని భాషలు ధారావాహికంగా మాట్లాడగలను. ఇంగ్లీష్ మీడియమ్ గ్రాడ్యుయేట్ ని. స్వర్ణ తండ్రి నా బాస్. నేను ఆయన కంపెనీలో పని చేస్తున్నాను. తెలివితేటలు గలవాడినని ఆయనే చాలా సార్లు మెచ్చుకున్నాడు. అవకాశం వుంటే అటువంటి కంపెనీలు ఎన్నయినా మేనేజ్ చెయ్యగల సామర్థ్యం వుంది నాకు.

స్వర్ణ నన్ను ఎందుకు ప్రేమించింది. నేను ఆకర్షణీయమైన యువకుడిననే.

మేమిద్దరం షికార్లు కొడుతూ వుండడం మా బాస్ కంటపడింది. ఆయనెప్పుడూ అభ్యంతరం చెప్పలేదు. చాలా కల్చర్ గల మనిషి.

కాని నాకు డబ్బు లేకపోవడంవల్ల ఆయన అల్లుడిగా

పనికిరాను.

డబ్బు లేని వాడు ప్రేమించడానికి అర్హుడు కాడు. ఆ సంగతి స్వర్ణ స్పష్టంగా తెలిపింది.

నేను డబ్బు సంపాదించి కారులో త్రిప్పగలిగి, మేడలో సుఖపెట్ట గలిగినప్పుడు స్వర్ణ నన్ను పెళ్లాడుతుంది.

వారెవ్వా ఏమి లోకం?

ప్రేమ గుడ్డిది అన్న కవి ఎవడోగాని గొప్ప అనుభవంతో చెప్పాడు.

ప్రేమ కోసం నేను చెడ్డవాడిగా మారాలని నిశ్చయించుకున్నాను.

మంచివాడికి ప్రేమ లభించి వుంటే చెడ్డవాడిగా మారాల్సిన అవసరం ఏముంది?

ఎప్పుడు తెలుసుకుంటారో ఈ సంగతి?

# 3

గేట్ వే ఆఫ్ ఇండియా దగ్గిర నిల్చున్నాను.

ఆలోచనలతో నా బుర్ర వేడెక్కిపోయింది. ప్రొద్దున్న స్వర్ణతో చేసిన సంభాషణ టేప్ రికార్డు చేసినట్లు రిపీట్ అవుతోంది.

డబ్బు సంపాదించాలి?

ఏమిటి మార్గం?

ఏం చేసి అయినా ఫరవాలేదు.

నాకొక అలవాటు వుంది. ప్రయాణం చేసేటప్పుడు నా శరీరం వుయ్యాలలూగుతూ వుంటే మంచి ఆలోచనలు వస్తాయి. నా ప్రాబ్లమ్స్ సాల్వ్ అవుతాయి.

సముద్రంలో పడవలు అటూ ఇటూ తిరుగుతున్నాయి. పడవలో ప్రయాణం చేస్తే నాకొక మార్గం దొరుకుతుంది.

ఒక లాంచీలో ఎక్కి కూర్చున్నాను. ఎలిఫెంటా కేవ్స్‌కి ప్రయాణమయ్యాను.

సముద్రంలో జోరుగా పోతోంది లాంచి. నా ఆలోచనలు దూసుకుని పోతున్నాయి వేగంగా. లాంచిలో చాలమంది వున్నారు. ఎక్కువమంది అమ్మాయిలు. ఎవరో టూరిస్టులు లాగా వున్నారు.

వాళ్ళలో ఎవరివో రెండు కళ్ళు నన్ను తదేకంగా చూడసాగాయి. తీరా పరికించి చూస్తే ఆమె మిస్ సవిత. మా వీధిలోనే ఆమె డిస్పెన్సరీ వుంది.

ఆమె బెంగాలీ. హిందీ అనర్గళంగా మాట్లాడుతుంది. మరాఠీ పప్పులా రుబ్బేస్తుంది. ఇంగ్లీషు చెప్పనక్కర్లేదు కాన్వెంట్ స్టూడెంట్‌ని నన్నే అదరగొట్టేస్తుంది.

ఆమెకు నేనంటే ఇష్టం అని ఎప్పుడో గ్రహించాను. ఒకసారి మలేరియా తగిలితే ట్రీట్‌మెంట్ ఇచ్చింది. ఇన్ పేషేంట్‌గా చేర్చుకుని పదిరోజులు కదలనివ్వలేదు. నన్ను నీడలా అంటిపెట్టుకుంది. అంతేకాదు, మందులకు కూడా చార్జి చెయ్యలేదు. అంతా ఫ్రీ సర్వీస్. వచ్చిన గొడవ ఏమిటంటే ఆ డాక్టర్ నన్ను ప్రేమిస్తోంది.

సవిత ఎర్రగా వుంటుంది. పొడుగ్గా వుంటుంది. నీట్‌గా డ్రెస్ చేసుకుంటుంది. లిప్‌స్టిక్ కొట్టి, మేకప్ దంచి నన్ను వలలో వేసుకోవాలని తెగ ప్రయత్నిస్తోంది. ఆమె అందగత్తే. ఇంకా అభ్యంతరం ఎంగుకంటే ఆమెకు దాదాపు నలభై ఏళ్ళుంటాయి. కాని ముప్పై వున్నదానిలా కనిపిస్తుంది. ఇరవై ఏళ్ళదానిలా ప్రవర్తిస్తుంది.

ఆ డాక్టర్ గ్రంథసాంగురాలని పెద్ద పేరుంది.

వయసులో చెడతిరిగింది. బెంగాల్లో ఆమె తల్లి దండ్రీ ఎవరూ లేరు. అంతా పోయారు. ఇద్దరు చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు చేసి పంపేసింది. ఈ లోపల వయసు మీరింది. అదీ సంగతి. ఇక పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకుంది. ఈ కథంతా నాకు చెప్పింది.

అందుకే సవిత అంటే భయం నాకు. ఏ మాత్రం చనువుగా మెలిగినా పెళ్ళి చేసుకోమని ఎక్కడ పట్టుకుంటుందోనని దడ. ఒక వైపు స్వర్ణతో ప్రేమాయాణం సాగిస్తూ రెండో ట్రాక్‌లో ఈవిడను ఎలా ప్రేమించను?

కాని ఇప్పుడు నా ఆలోచనలు వేరుగదా? నాకిప్పుడు సవిత డబ్బు కావాలి.

"హాయ్! డాక్టర్" అన్నాను చిరునవ్వుతో.

"హాయ్! శ్యాం" అంటూ తన సీటులో నుంచి లేచి వచ్చి నా ప్రక్కనే కూర్చుండి.

"డాక్టర్! ఎలిఫెంటా కేవ్స్‌కి వెళ్తున్నారా? ఏమిటి విశేషం?" అన్నాను.

"శ్యాం నా మనసు బాగాలేదు" అంది.

"ఏం జరిగింది?"

"ఏం జరగలేదు. అందుకే మనసు బాగాలేదు. ఈ రోజు కాస్త విశ్రాంతి తీసుకోవాలనుకున్నాను. అక్కడుంటే కాసేపు ఊపిరి పీల్చుకోనివ్వరు. అందుకే ఇలా వచ్చేశాను" అంది.

"ఓ...." అన్నాను.

డాక్టర్ సవిత ఆకుపచ్చ డ్రెస్‌లో వుంది. స్లీవ్ లెస్ జాకెట్ వేసుకుంది. ఆమె జబ్బలు ఎర్రగా మాంసం కండల్లా పూగుతున్నాయి. మేకప్‌లో ఫరవాలేదుగాని లేకపోతే ముఖంమీద ముడతలు స్పష్టంగా కనిపిస్తాయి.

ఆ వయసులో గట్టిగా వుండంటే కారణం పిల్లలు కనక పోవడమే. లేకపోతే ముసలమ్మలా వుండేది.

సముద్రంలోనుంచి చల్లటి గాలి వీస్తోంది.

సవిత కళ్ళు మూసుకుని నా భుజంమీద తలవాల్చి చేత్తో నా కాలరు పట్టుకుని తన్మయత్వంలో మునిగి పోయింది. నేను ఇబ్బందిగా చూశాను. అందరూ మా వంక వింతగా చూస్తున్నారు. కొందరమ్మాయిలు గుసగుస లాడుకుంటున్నారు చెవుల్లో. నాకు కొంచెం సిగ్గనిపించింది.

లాంచీ కేవ్ దగ్గర కొచ్చింది. నెమ్మదిగా దిగి ఆమెకు చేతిని అందించాను. చచ్చాను. ఇక చాలా సేపటివరకూ ఆమె నా చెయ్యి వదలలేదు. వేళ్ళతో నొక్కుతూనే వుంది. మెట్లెక్కి పైకి వెళ్ళిందాకా నా నడుంచుట్టూ చేతులు వేసి నడిచింది. ముసలి పెళ్ళాం—పడుచు మొగుడూ అనుకుంటారేమోనని నా భయం.

తిరిగి గేట్ వే ఆఫ్ ఇండియా దగ్గరకి లాంచీలో వచ్చేవరకూ ఖర్చంతా తనే పెట్టుకుంది సవిత.

లాంచీలో సముద్ర ప్రయాణంవల్ల నాకు ఏమీ లాభం కలుగలేదని నిశ్చయించుకుంటున్న తరుణంలో సవిత మెడ లోని సన్నటి లాకెట్ నా దృష్టి నాకర్షించింది.

నా మెదడులో ఒక మెరుపు మెరిసింది.

లాంచీ దిగిన తర్వాత పనివుందని సవితను వదిలించుకున్నాను. సవిత టాక్సీలో వెళ్ళిపోయింది.

పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి స్వర్ణకి ఫోన్ చేశాను. అదృష్టవశాత్తు ఇంట్లోనే వుంది. ఆఖరిసారి నన్ను కలుసుకుని కులాసాగా గడపమని స్వర్ణని రిక్వెస్టు చేశాను. ముందు ఒప్పుకోలేదు. తర్వాత సరేనంది. గేట్ వే ఆఫ్

ఇండియా దగ్గరికి రమ్మని చెప్పాను.

అప్పటికి సాయంకాలం ఐదయింది.

అరగంటలో బ్లూ ఫియట్ కారు వచ్చి నా ముందు ఆగింది. స్వర్ణ చెయ్యి వూపింది. వెళ్ళి కార్లో కూర్చున్నాను. కారు తాజ్ మహల్ హోటల్లో ఆగింది.

కాఫీ త్రాగిన తర్వాత "ఏమిటి సంగతి?" అంది.

"సినిమాకి వెళ్దాం" అన్నాను.

"ఏ సినిమాకి?" అంది.

"మరాటా మందిర్" అన్నాను.

"ఆ సినిమా చూశాను" అంది.

"నేను చూల్లేదు. అయినా మనం వెళ్ళేది సినిమా చూడటానికా?" అన్నాను నవ్వుతూ.

స్వర్ణ నవ్వింది.

మేము ఎప్పుడు సినిమా కెళ్ళినా మా గొడవలో వుంటాం. కబుర్లు, గుసగుసలు, వీలైతే ముద్దులు. మా చుట్టూ జనం వున్న సంగతే మర్చిపోతాం.

సినిమా చూశాక "గుడ్ నైట్ అండ్ గుడ్ బై" అంది.

"మళ్ళీ రెండేళ్ళకే నిన్ను చూసేది" అన్నాను విచారంగా.

స్వర్ణ గూడా విచారంలో మునిగినట్లు అనిపించింది.

ఆమె కూర్చున్న ఫియట్ కారు వెళ్ళిపోయింది.

స్వర్ణ మెడలోని డైమండ్ నెక్లెస్ నా జేబులో భద్రంగా వుండిపోయింది.

నవ్వుకున్నాను.

'మోసం చేసి అయినా డబ్బు సంపాదించమని నాకు బోధించినందుకు ఆమెనే మోసం చేశాను!

నేను మళ్ళీ కంపెనీ మొఖం చూడదల్చుకోలేదు. అదొక ఊబి. ఎన్నేళ్ళు పనిచేసినా మిగిలేది ఏమీ వుండదు. గాజుల బేరం కూటికి సరి అన్నట్లు ఏ వుద్యోగం చూసినా అంతే అనుకుంటా. లంచాలు దొరికేది తప్ప.

అదీకాక అక్కడ ఎప్పుడైనా స్వర్ణ ముఖం చూడాల్సి రావచ్చు. ఎందుకొచ్చిన గొడవ. నేను డబ్బు సంపాదించే ప్రయత్నంలో లేనని ఆమె అపోహపడనూ వచ్చు.

డైమండ్ నెక్లెస్ పోయినందుకు స్వర్ణ నన్ను అనుమానిస్తుందా? లేదా? అనే ధర్మ సందేహంతో నాకు ఆ రాత్రి చాలా సేపు నిద్రపట్టలేదు. నన్ను అనుమానిస్తే నా కోసం వస్తుంది గదా! మా రూమ్ తనకి తెలుసు.

ఎక్కడికీ కదలకుండా రూమ్‌లోనే వున్నాను. మా రూమ్ మేట్స్ ఎక్కడి వాళ్ళక్కడ వెళ్ళిపోయారు. సాయంకాలం వరకూ స్వర్ణ రాలేదు. నేను దొంగిలించానని వూరుకొందా? లేకపోతే ఎక్కడైనా జారిపోయిందని అనుకొన్నదా? చాలా సేపు ఆలోచించాను. ఏమీ సమాధానం స్ఫురించలేదు.

మర్నాడు కూడా స్వర్ణ రాలేదు. ఇక రాదని నిశ్చయించుకున్నాను.

డైమండ్ నెక్లెస్‌తో నా బిజినెస్ మొదలుపెట్టాలి.

రాత్రి ఎనిమిదింటికి సవిత డిస్పెన్సరీ పల్చగా వుంది. అరగంటలో క్లియర్ అయిపోయింది. పేషెంట్లు అంతా ఆడవాళ్ళే.

నేను ఆఖరి పేషంటు.

"నమస్తే" అన్నాను.

"హూఁ.... చెప్పండి" అంది సవిత.

ఆమె నన్ను గుర్తుపట్టలేను. ఎలా పడుతుంది? నేను వేషం మార్చుకున్నాను. ఫుల్ సూట్‌లో గడ్డం అతికించుకున్నాను. గోల్డుఫ్రేం కళ్ళద్దాలు పెట్టుకున్నాను.

"నన్ను ఇన్ పేషంటుగా చేర్చుకోండి."

"ఏమిటి మీకు ట్రబుల్?"

"ఏమీ లేదు."

సవిత ఆశ్చర్యపోయింది.

"ఏమీ లేదా?"

"అవును" అన్నాను తల వూపుతూ.

"ఏమీ లేనప్పుడు ఎందుకు?"

"కనీసం వారం రోజులు వుండనివ్వండి" అన్నాను.

"అసలు సంగతి చెప్పండి?" విసుగ్గా అంది సవిత.

"నన్నొక అమ్మాయి పెళ్ళి చేసుకోమని ప్రాణం తీస్తోంది. కాని నాకు ఇష్టంలేదు. వారం రోజులు ఓపిక పడితే ఆమెకు వేరే మాచ్ సెటిల్ అవుతుంది. అందుకే ఇక్కడ వుండదల్చుకున్నాను."

"ఏం పెళ్ళి ఎందుకు ఇష్టంలేదు?"

"పెళ్ళి చేసుకుని బొంబాయిలో కాపురం పెట్టి నేనేం సుఖపడగలను డాక్టర్?" అన్నాను.

"అవునూ! మీరు నా హాస్పిటల్లో నే ఎందుకు వుండాలనుకుంటున్నారు?"

"మీరు నాకు తెలిసినవారు. అదీగాక నా రూమ్ ఇక్కడికి కనిపిస్తూనే వుంటుంది. ఆమె నా రూమ్‌కి వచ్చి పోతుంటే తెలుస్తూంది. సంగతులు కనుక్కో వచ్చును" అన్నాను.

ఈసారి ఆమె మరింత ఆశ్చర్యపోయింది.

"మిమ్మల్ని నేను ఎరగనే?" అంది.

నేను గడ్డం వూడబీకి నవ్వాను.

"యూ! శ్యాం?" అంది ఆనందంతో.

"ఎలా వుంది నా వేషం?" అన్నాను మళ్ళీ వెంటనే గడ్డం అతికించుకుంటూ.

"అసాధ్యుడివి. ఎంత టోకరా ఇచ్చావ్? గుర్తుపట్ట లేక పోయాను" అంది.

"జీవితమే ఒక నాటకరంగం అన్నాడు ఎవరో ఒక కవి. ఎన్ని వేషాలు వెయ్యాల్లో ముందు ముందు."

"ఎవరా పిల్ల?"

"మా కంపెనీలోనే పనిచేస్తూ వుంది. అమీనా అని."

"అయితే గ్రంధం నడిపి తప్పించుకుంటున్నావన్న మాట."

"నా తప్పేంలేదు. నన్ను ప్రేమిస్తున్నానని వెంట పడింది. ఓ.కే. అన్నాను. అంతేగాని ఆమెను పెళ్ళి చేసుకుంటానని యెప్పుడూ ప్రామిస్ చెయ్యలేదు. నెల తప్పానని గొడవ చేస్తోంది. ఏం చెయ్యను? వాళ్ళ ఇంట్లో వాళ్ళు పెళ్ళి చేస్తామని పట్టుబట్టారు. అబార్షన్ చేయించుకోమని సలహా ఇచ్చాను. కాని వింటేనా? నా భయం ఏమిటంటే వాళ్ళ వాళ్ళు నన్ను యెత్తుకుపోయి బలవంతంగా పెళ్ళి చేస్తారేమోనని. అందుకే ఈ వేషం. రహస్యంగా వుంటాను కొన్నాళ్ళు. దానికి పెళ్ళి అయిందాకా ఈ వేషంలోనే తిరుగుతాను."

అంతా విని సవిత విరగబడి నవ్వింది.

నా పేరు వినోద్ కుమార్ అని తన ఇన్ పేషంట్స్ రిజిష్టర్లో రాసి మూడో అంతస్థులో ఏ.సి. రూమ్ ఎలాట్

చేసింది.

నేను అనుకున్నట్లే సవిత దాసురాలైంది. రాత్రి పదింటికల్లా రూమ్‌లోకి వచ్చి లాక్ చేసేది. చల్లటి రూమ్‌లో వెచ్చటి విస్కీ గొంతులోకి పోతుంటే స్వర్గంలో తేలుతున్నట్లుండేది. సవిత నాకు అమర సుఖాలు అందించేది. జీవితానికి ఇంతకంటే కావల్సింది ఏమిటి? అనిపించేది.

కాని ఎంత మత్తులో వున్నా స్వర్ణ జ్ఞాపకం వస్తూ వుండేది. స్వర్ణతో నేను అనుభవించబోయే సుఖాల ముందు ఇవన్నీ లెక్కలో లేనివి అనిపించేది.

"డోంట్ లీవ్ మీ డియర్" అంది ఒకరోజు రాత్రి సవిత.

"ఐ లైక్ యూ డార్లింగ్" అన్నాను తమకంతో ఆమె నగ్న శరీరాన్ని హృదయానికి హత్తుకుంటూ.

"డియర్ శ్యాం! నాకు ముప్పై ఏళ్ళు నిండాయి. ఇక జీవితంలో స్థిరపడదల్చుకున్నాను" అంది.

"వూఁ...."

"నీకంటే రెండు మూడేళ్లు పెద్దదాన్ని కావచ్చు."

"నెవర్ మైండ్."

"నన్ను పెళ్ళి చేసుకో శ్యాం."

"అలాగే డాక్టర్!"

"నో. యూ కాల్ మీ సవితా!" నవ్వింది.

"యస్ డార్లింగ్."

"ఎప్పుడు?"

"నీ ఇష్టం సవితా."

"థాంక్స్.... శ్యాం.... మెనీ.... మెనీ థాంక్స్. నీవంటి అందగాడు నాకు భర్త అవడమే నాకు చాలు."

"నేను అంత అందంగా వుంటానా?"

"యస్. డియర్. నువ్వొక హీరోలా వుంటావు. రియల్లీ యూ ఆర్ ఏ హీ మాన్" అంది సవిత ఆనందంతో.

నేను డైమండ్ నెక్లెస్ సవిత మెడలో అలంకరించాను.

ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. నేనంత ఖరీదైన కానుక ఇస్తానని ఆమె వూహించలేదు. అయితే అది ఎక్కడిదని నన్ను అడగలేదు. అడిగితే దానికొక కథ అల్లి చెప్పాల్సి వచ్చేది.

"అమీనా పెళ్ళి జరిగేవరకూ మనం ఆగితే మంచిది. అంతవరకూ నా సంగతి సీక్రెట్‌గా వుంచు. నేనిక్కడ వున్నట్లు ఎవరికీ తెలియగూడదు" అన్నాను.

సరే అంది సవిత. అక్కడ వినోద్‌కుమార్ పేరుతోనే వుంటూ నాకు ఎంత డబ్బు గిట్టుబాటు అవుతుందో అంచనా వేయసాగాను.

సవిత గదిలో వున్న ఐరన్ సేఫ్‌లో డబ్బుతోపాటు బంగారం గూడా వుంది. బ్యాంక్ పాస్ బుక్‌లో ఏభై వేలకు పైగా క్యాష్ వుంది. ఇంకా ఫిక్స్‌డ్ డిపాజిట్లు కొన్ని వున్నాయి.

ఒక పదిరోజులు గడవనిచ్చి "అమీనా పెళ్ళి కుదిరింది" అన్నాను సంతోషం వ్యక్తపరుస్తూ.

"వెరీ గుడ్" అంది సవిత.

"మన పెళ్ళి తర్వాతే."

"ఆ ఏరేంజ్‌మెంట్స్ నువ్వే చూడాలి శ్యాం. నాకు తీరిక దొరకదు. పేమంట్లతోనే సరిపోతుంది" అంది.

"అలాగే. ప్రస్తుతం నా దగ్గిర డబ్బులేదు" అన్నాను.

"యూ సిల్లీ. నా డబ్బు నీ డబ్బు కాదా" అని

చెక్ మీద సంతకం పెట్టి అందించింది.

"అంకె వెయ్యలేదేం?"

"ఎంత కావాలో నువ్వే వేసుకో" అంది నవ్వుతూ.

నాలుగు రోజులవరకూ నేనా చెక్ మార్చలేదు. మంచిరోజు కోసం వెయిట్ చేస్తున్నాను. సవిత సేఫ్‌లో డబ్బు, బంగారం తీసుకుని బొంబాయి వదిలిపోవాలి. అదీ నా ప్లాన్.

ఒక రోజు నలభై ఆయిదు వేలకు చెక్ రాసి మార్చుకున్నాను. బ్యాంకి వాళ్ళకు అనుమానం వచ్చి సవితకు ఫోన్ చేసి అడిగారు. ఆమె తనే పంపించానని చెప్పింది. వచ్చిన తర్వాత అడిగింది అంత డబ్బు ఎందుకని? పెళ్ళి కాగానే స్విట్జర్‌లాండ్ హానీమూన్ వెళ్ళామని అన్నాను.

"మంచి ఆలోచన. నేనూ ఎప్పుడూ ఫారెన్ వెళ్ళలేదు. పాస్‌పోర్టు రెడీచేయించు" అంది.

అర్థరాత్రి దాటింది.

సవిత అలిసిపోయి నిద్రపోతోంది.

నేను డబ్బంతా సూట్‌కేసులో సర్దుకున్నాను. నా వస్తువులు అక్కడ ఏమీ లేకుండా జాగ్రత్తపడ్డాను. సవిత గది, అందులో సేఫ్ తాళాలు ఆమె బ్లౌజ్లో వుంటాయి. అవి దొంగిలించాక డబ్బు, బంగారం స్వంతం చేసుకుని పారిపోవాలి. అదంతా బ్లాక్ డబ్బయి వుంటుంది. పోలీసులకు రిపోర్టు ఇవ్వలేదు.

సవిత బ్లౌజ్లో తాళాలు జాగ్రత్తగా లాగి సూట్‌కేసుతో బైటపడ్డాను. సవిత గది లాక్ తీసి ఐరన్ సేఫ్ తెరిచాను. డబ్బు, బంగారం సర్దుతున్నాను.

ఇంతలో సవిత ఆ గదిలోకి ప్రవేశించింది.

ఆమె కళ్ళు కోపంతో చూస్తున్నాయి.

"యూ! బ్రూట్....నన్నే మోసం చేస్తావా?" అంది.

సవిత అప్పుడక్కడికి వస్తుందని నేను వూహించలేదు. సడన్‌గా వచ్చేసరికి ఏం చెయ్యాలో తోచలేదు.

"గెటవుట్ రాస్కెల్. నువ్వింత మోసగాడివని అనుకోలేదు" గట్టిగా కేకలు పెడుతోంది సవిత.

నాకు భయం వేసింది ఆమె కేకలు విని ఎవరైనా వస్తారేమోనని. ఒకవైపు ఛాన్సు చెయ్యి జారిపోతున్నందుకు బాధ కలుగుతోంది. ఎన్నాళ్ళు కష్టపడి ప్లాన్ వేశానో గదా? ఈ విధంగా భగ్నమై పోతుందని నేను అనుకోలేదు.

ఇక లాభంలేదు. సవిత నోరు ముయ్యాలి. ముందు తలుపు మూశాను. తర్వాత సవిత నోరు మూశాను. నా బలమైన బాహువులు ఆమె గొంతు పిసికి పరలోకం పంపేశాయి.

గది తలుపు లాక్ చేసి బయటికొచ్చేశాను. సవిత శవం వాసన కొట్టేవరకూ ఎవరూ కనుక్కోలేరు. నేను తాపీగా సెంట్రల్ స్టేషన్ చేరుకున్నాను.

నా రెండో మజిలీ హైదరాబాద్.

## 5

సవితను నేను హత్య చేయాలని అనుకోలేదు. కాని అదొక దుర్ఘటన. ఆమెకు మృత్యువు ముంచుకొచ్చింది.

ప్రతి రోజూ సుఖంగా నిద్రపోయే మనిషి అప్పుడే లేచి రావాలా? ఖర్మ అంటారు అదే కాబోలు. అయినా నా చేతిలో ఏమీ లేదని గీతలో లార్డు కృష్ణ చెప్పాడు కదా. అంతా ఆయన ఆజ్ఞ ప్రకారమే చేస్తున్నాను.

ఇందులో నా తప్పేం లేదు.

గీతని తల్చుకోగానే నాకు ధైర్యం కలిగింది. పాపాలు చేసేవారికి గీత ధైర్యాన్ని ఇస్తుందనే విషయం గ్రహించి ఆశ్చర్యపోయాను.

మొదటి హత్య కాబట్టి నాకు ఎందుకో మనసులో ఆందోళన కలిగింది. సవిత అనుభవించిన నరకయాతన, చచ్చేముందు ఆమె ముఖంలో కన్పించిన వికారమూ నాకు కొన్ని రోజులపాటు కలలో వచ్చేవి. సుఖంగా నిద్రపట్టడం కోసం విస్కీ కొట్టి పడుకునే వాడిని.

సవిత మరణించిన విషయం పోలీసులు తెలుసు కున్నారో, లేదో తెలుసుకోవాలని కుతూహలంగా వుండేది. ప్రతి రోజూ టైమ్స్ ఆఫ్ ఇండియా చూస్తుండే వాడిని. యెట్టకేలకు వారం తర్వాత చిన్న కాలమ్‌లో పడింది. పోలీసులు దర్యాప్తు చేస్తున్నారని వుంది.

వాళ్ళ మొఖం. నన్ను కనిపెట్టడం వాళ్ళ వల్లకాదు గదా! లండన్ స్కాట్లండ్ యార్డు డిటెక్టివ్‌లు గూడా కనిపెట్టలేరు.

బంజారా హిల్స్‌లో పెద్ద బిల్డింగ్ అద్దెకు తీసు కున్నాను. నెలకు వెయ్యి. అయితేనేం ఫర్నిచర్ గూడా వాడుకోవచ్చని చెప్పాడు ఇంటి యజమాని. అతను స్టేట్ బ్యాంక్‌లో ఆఫీసర్. మద్రాసు ట్రాన్స్‌ఫర్ అయింది అతనికి.

ప్రైవేట్ కారు ఒకటి అద్దెకు తీసుకుని స్వయంగా నడుపుతూ నేనొక లాత్షాధికారిననే అభిప్రాయం కలుగ జేశాను. వుండేది నేను ఒక్కడినే. నాకు నలుగురు నౌకర్లు. వాళ్ళుగాక గేటు ముందొక గుర్ఖా వాచ్ మాన్.

శ్యాం ప్రసాద్, బి. ఇ., యు. యస్. ఏ., పార్ట్నర్, సోఫియా ఇంజనీరింగ్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ, లాస్ ఏంజల్స్, అనే నేమ్ ప్లేట్ ఇత్తడితో చేయించి గేటుకి వ్రేలాడదీయించాను. రోజూ బ్రాసోతో పాలిష్ చేసి తళతళ మెరిసేటట్లు రుద్దేవాడు వాచ్‌మాన్.

సిటీలో వెలువడే డెయిలీ పేపర్లలో ప్రకటన వేయించాను. అమెరికాలోని లాస్ ఏంజేల్స్ సిటీలో ప్రసిద్ధ ఇంజనీరింగ్ కంపెనీలో భాగస్తుడైన, ఇంజనీర్‌కి అందమైన వధువు కావలెను. ఫలానా కులమువారే సంప్రదించవలెను. ధనవంతులకే అవకాశము.

నాకు తెలుసు. మా కులంలో కట్నాలు యెక్కువ ముట్టజెప్తారని. రెండో రోజునుంచి నేనిచ్చిన బాక్సు నెంబర్లకి చాలా దరఖాస్తులు వచ్చాయి. కొందరు ఫోటోలతో సహా పంపారు. నాకు కావలసింది వధువు అందంకాదు. యెక్కువ డబ్బుతో వచ్చే పిల్ల. వ్యాపారస్తుల కుటుంబం అయితే నాకు మంచిది. వాళ్ళ దగ్గిర బ్లాక్ డబ్బు వుంటుంది.

వెంకటరాయుడు అనే పెద్దమనిషి రాసిన అంశాలు నాకు నచ్చాయి. అంటే లాభదాయకంగా వున్నాయి.

ఆయనకి సిటీలోనే ఒక ఫ్యాక్టరీ వుంది. అంటే బ్లాక్ డబ్బు బాగా మూలుగుతుందని వూహించుకోవచ్చు. ఆయన కూతురు పేరు ప్రమీలారాణి అట. ఇంటర్ వరకూ చదివి మానేసిందట. చూడటానికి బాగానే వుంది. పట్టుచీర కట్టుకుని మహా పతివ్రతలా కనిపిస్తోంది. నన్ను ఫలానా రోజు కలుసుకోమని నా అడ్రస్ ఇచ్చాను.

ఆ రోజు రానే వచ్చింది. ఉదయం పదింటికే అంబా

సిడర్ కారులో వచ్చాడు. వెంట ఆయన భార్య వుంది. ఆయన్ని చూస్తే నాకు సీమపంది జ్ఞాపకం వచ్చి నవ్వొచ్చింది. ఆమెను చూస్తే జెర్సీ గేదె పోలికలు కనిపించాయి. ఆయన యెర్రగా, ఆమె నల్లగా రెండు ఏనుగులు నడుస్తున్నట్లే వచ్చారు.

ఈ గురుడు బాగానే దాచివుంటాడు బ్లాక్ మనీ. మనుషుల్ని చూస్తుంటేనే తెలిసిపోతోంది.

"నమస్కారం వెంకటరాయుడుగారూ!" కొంచం ఇంగ్లీషు యాసలో అన్నాను.

"నమస్తే! మిష్టర్ శ్యాంప్రసాద్" అన్నాడాయన.

ఆమె ఏమీ మాట్లాడకుండానే నమస్కారం చేసింది.

"ఇంట్లో యెవరూ లేరా?" అన్నాడాయన ఇల్లంతా కలయజూస్తూ.

"లేరు. నేను ఒక్కడినే వచ్చాను. మ్యారేజి పర్పస్‌తో" అన్నాను.

నౌకర్లు ట్రేలతో పుల్లారెడ్డి సీట్స్, జీడిపప్పు, పకోడి తెచ్చి టీపాయ్ మీద సర్దారు.

"యెందుకండీ ఇవ్వన్నీను...." అన్నాడాయన మొఖమాట పడుతూ. తింటే అరగదని చెప్పలేక వేధవ ఏడుపు.

"ఫరవాలేదు...." అని నేను సిగ్గును అభినయించాను.

ఆమె నా వంక యెగాదిగా చూస్తోంది. నేను బాగా ఆకర్షించేటట్లు డ్రెస్ చేసుకుని కూర్చున్నాను. అమెరికా నుంచి అప్పుడే దిగినట్లు ప్రవర్తించసాగాను. నా మాటల్లో ఇంగ్లీషు యాస వుండేటట్లు జాగ్రత్త పడ్డాను.

"మీరు అక్కడ వ్యాపారం చేస్తున్నారా?" ప్రశ్నించాడు.

"అవునండీ మా ఫాదర్ ముఫ్పై ఏళ్ళ క్రితమే అక్కడ సెటిల్ అయ్యారు. సోఫియా కంపెనీలో మాకు ఫిఫ్టీ పర్సెంట్ వాటాలు వున్నాయి. మా అన్నయ్యకు ఫిఫ్టీన్, నాకు ఫిఫ్టీన్, మా ఫాదర్ పేరుతో ట్వెంటీ పర్సెంట్. లాస్ ఏంజెల్స్‌లో మాది లీడింగ్ కంపెనీ" అన్నాను.

"మీది స్వగ్రామం యెక్కడ?"

"గుంటూరు జిల్లా, తెనాలి తాలుకా, జాగర్లమూడి."

"ఓ.... నాకు తెలుసు ఆ ఊరు" అన్నాడాయన.

నా గుండెలో రాయి పడింది. ఆ ఊరు గురించి వివరాలు అడుగుతాడేమోనని.

"మీది ఏ ఊరు?" అన్నాను.

"మాది కృష్ణా జిల్లా. గుడివాడ" అన్నాడు.

"మా ఊరు యెప్పుడైనా వచ్చారా?"

"లేదు.... లేదు.... కాని ఆ ఊరునుంచి వచ్చినవాళ్ళు మా ఫ్యాక్టరీలో ఇద్దరు పనిచేస్తున్నారు."

"పేరుకి మా వూరేగాని అక్కడ నాకు తెలిసిన వాళ్ళు యెవరూ లేరు. మా ఫాదర్‌కి తెలిసినవాళ్ళు వుండొచ్చు."

"అంతే గదా!.... మేమూ అంతే. ఆంధ్రప్రదేశ్ ఫారమ్ అయినప్పుడు వచ్చాను. మా పిల్లలకి మా వూళ్ళో యెవరూ తెలీదు" అని నవ్వాడు.

ఇక నేను సొరకాయలు మొదలు పెట్టాను. అంతా కోట్లలోను లక్షలలోనూ చెప్తున్నాను. లాస్ ఏంజెల్స్‌లో మాకున్న ప్లాట్‌లో సౌకర్యాలు, మా కార్లు, మా నాగరికత. ఆయన నోరు తెరుచుకుని విన్నాడు.

"కాని అక్కడ మనవాళ్ళున్నా రనుకోండి. వాళ్ళకి

ఇండియన్ కల్చర్ తెలీదు. మిష్టర్ సత్యనారాయణ చౌదరి అని మనవాడున్నాడు. లక్ష డాలర్లు కట్నం ఆఫర్ చేశాడు. కాని నేను వద్దన్నాను. కల్చర్ జన్మతా రావాలి. అమ్మాయి ఇండియాలో పుట్టి వుండాలని నా పట్టుదల. కట్నం తక్కువైనా అభ్యంతరం లేదు నాకు."

వెంకట్రాయుడు కంగు అన్నాడు. నాకు అంత కట్నం ఇవ్వాల్సి వస్తుందని వూహించి వుండడు. నేను కట్నం గురించి యెత్తలేదు.

"నేను ముందుగానే చెప్తున్నాను. సంవత్సరానికి ఒక్కసారి మాత్రమే మేము ఇండియా రాగలం. అప్పుడే మీ అమ్మాయి పదిరోజులు వుండగలుగుతుంది. డబ్బు గురించి కాదుగాని మాకు టైమ్ వుండదు" పెద్ద స్టయిల్ గా అన్నాను.

"అలాగే....అలాగే...." అన్నాడు.

"మా ఫాదర్ వీలుగా వుంటే పెళ్ళి నాటికి వస్తాడు. యెవరైనా అప్పటికే వస్తారు. పెళ్ళయినాక మీరు అమ్మాయితో పాటు అమెరికా రావాలి. కొంత కాలం వుండాలి" అన్నాను.

ఇద్దరూ గాలికొట్టిన బెలూన్లగా వుబ్బిపోతున్నారు.

"పేపర్లో ఇచ్చిన ప్రకటనకి దాదాపు ఇప్పటికే వందపైచిలుకు ఆఫర్స్ వచ్చాయి. అందులో నేను సూటబుల్ మాచ్ సెటిల్ చేసుకోవాలి గదా" అన్నాను.

"అవునవును....మీరు అమ్మాయిని చూసుకోండి" అన్నాడు.

"ఫోటో చూశాగా" నవ్వాను.

ఇద్దరూ ముఖాలు చూసుకున్నారు.

"మీరే చెప్పాలి. మీకు నేను నచ్చానా లేదా? మీ

అమ్మాయిని గూడా తీసుకొస్తే బాగుండేది" అన్నాను.

"అలా కాదు. మీరు మా ఇంటికి రావాలి. మీకెప్పుడు వీలయితే అప్పుడు తీసుకెళ్తాను" అన్నాడు.

"రేపు వస్తాను" అన్నాను.

లంచ్ టైమయింది. మా కుక్ భోజనం రెడీ అన్నాడు. వాళ్ళని బలవంతం చేసి డైనింగ్ రూమ్‌కి లాక్కెళ్ళాను. కోడి బిరియాని మసాలా వాసనకి వుక్కిరి బిక్కిరై పోయాడు గురుడు. తెగ లాగించేశాడు. రాత్రికి చస్తాడు తిన్నది అరక్క.

"ఏమిటి విశేషాలు?" అన్నాను.

"రెండు లక్షలు ఇవ్వగలను. అంతే నా ఆఫర్" అన్నాడు.

"కట్నందగ్గిర బేరం ఆడడం నా కిష్టంలేదు. ఎప్పుడైనా యిక్కడికి వచ్చినప్పుడు మమ్మల్ని మర్యాదగా చూస్తే చాలు. ఇండియా కల్చర్ అంటే నాకు అభిమానం" అన్నాను.

భోజనం అయ్యాక సెలవు తీసుకున్నాడు.

# 6

మర్నాడు వెళ్ళి ప్రమీలారాణిని చూశాను. మనిషి తల్లిపోలిక. రంగు చామనచాయ. ఎలాగుంటే ఎవడిక్కావాలి. మనకి కావలసింది డబ్బుగాని.

నచ్చిందని చెప్పేసి డైమండ్ నెక్లెస్ ప్రమీలారాణికి ప్రెజెంట్ చేశాను.

వెంకట్రాయుడు ఆ నెక్లెస్ చూసి కళ్ళు పెద్దవి చేశాడు. దాని ఖరీదు యెంత వుంటుందో నాకు తెలీదు. పదివేలు వుండొచ్చు.

"ఫిఫ్టీ తౌజెండ్ పెట్టి బొంబాయిలో కొన్నాను. ఎలా

వుంది?" అన్నాను.

ప్రమీలారాణికి నోట్లోనుంచి మాట రావడంలేదు ఆనందంతో. సిగ్గుపడిపోతోంది.

"మా అమెరికాలో ఇంత సిగ్గు పనికిరాదు" అన్నాను నవ్వుతూ.

"సిగ్గుపడడం ఇండియా కల్చర్" అన్నాడు వెంకట్రాయుడు.

నేను ఒప్పుకున్నాను.

"నేనిక మీ వాడినే. ఇండియా వచ్చేటప్పుడు మా ఫాదర్ ఖర్చుకి డబ్బిచ్చాడు. మీ దగ్గరే వుండనివ్వండి" అంటూ పాస్‌బుక్ ఇచ్చాను ఆయనకి.

ఐదు అంకెల ఫిగర్ చూసి గురుడి గుండె కొట్టుకుని ఉంటుంది.

"కట్నం డబ్బు అందులో జమ చేయండి. వెళ్ళే టప్పుడు బొంబాయిలో డాలర్లు మార్చుకుంటాను" అన్నాను.

"నేను డబ్బిస్తాను. మీరు బ్యాంక్‌లో జమ చేసుకోండి" అన్నాడు.

నేను ఎందుకని అడగలేదు. నాకు తెలుసు అది బ్లాక్ మనీ అని.

"మీ అమ్మాయి చేతికివ్వండి" అన్నాను నవ్వుతూ.

నాలుగు రోజుల తర్వాత వెంకట్రాయుడు డబ్బు వాళ్ళమ్మాయి చేతి కిచ్చి నా యెకౌంట్‌లో జమ చేయించాడు.

హమ్మయ్య!

అనుకున్నట్టే జరిగింది.

నేను హైదరాబాద్ వదిలి మద్రాస్ వెళ్ళిపోడానికి

అభ్యంతరం ఏమీ లేదు.

కాని స్వర్ణ డైమెండ్ నెక్లెస్ ప్రమీలారాణి దగ్గర వుండిపోయింది. అచ్చి వచ్చిన నెక్లెస్. దాన్ని పోనివ్వ గూడదు. అదీగాక దాని ద్వారా నా గురించిన క్లూ తెలుసుకోవడానికి అవకాశం వుండొచ్చు.

మర్నాడు సాయంకాలం వాళ్ళింటికి వెళ్ళి రవీంద్ర భారతిలో కూచిపూడి డ్యాన్సు చూడ్డానికి రమ్మని ప్రమీలారాణిని ఆఫర్ చేశాను.

నేను అనుకున్నట్లే డైమెండ్ నెక్లెస్ పెట్టుకొచ్చింది. కొంతదూరం కబుర్లు చెపుతూ తీసికెళ్ళి "అరె.... రె.... ఈ నెక్లెస్ ఎందుకు పెట్టుకొచ్చావు?" అన్నాను.

ఆమెకు అర్థంకానట్లు చూసింది.

"చాలా కాస్ట్లీ గదా! పోయిందంటే?" అన్నాను. కారు ప్రక్కన ఆపి "హేండ్ బ్యాగ్‌లో వుంచు" అన్నాను.

తెల్ల మొఖంవేసి "తీసుకు రాలేదండి" అంది.

"ఓ.... ఫరవాలేదు. ఇలా యివ్వు నేను జాగ్రత్త చేస్తాను." అన్నాను.

పాపం తీసియిచ్చింది. కోటు జేబులో వేసుకున్నాను. డ్యాన్సు అయిపోయాక ఆమెను యింటిదగ్గర డ్రాప్ చేశాను. కావాలనే నెక్లెస్ యివ్వలేదు. ఇంటికి వెళ్ళాక ఫోన్ చేశాను. "సారీ, ప్రమీలా! నెక్లెస్ నా దగ్గరే వుండిపోయింది."

"పరవాలేదు" అంది.

"ఇప్పుడు తీసుకురానా?"

"నో.... అక్కర్లేదు."

"రేపు నే నొచ్చి స్వయంగా నీ మెడలో అలంక రిస్తాను" అన్నాను.

ఫోన్‌లో నవ్వు వినిపించింది.

నేను అక్కడ ఉంటే గదా యిక? నా పని పూర్త యింది.

బ్యాంక్‌లో డబ్బు డ్రా చేసి డ్రాఫ్టగా మార్చుకుని మెడ్రాస్ చెక్కేశాను.

తర్వాత వెంకట్రాయుడు లబోదిబోమని ఏడవనియ్యి. నాకేం? ఎన్నో మోసాలు చేసి, టాక్సులు ఎగ్గొట్టి సాంపా దించిందే గదా?

నేను నయం కదూ? వాళ్ళమ్మాయిని పాడు చెయ్య కుండా వదిలిపెట్టాను.

సంతోషించాలి నా మంచితనం చూసి.

## 7

నా కోసం వెంకట్రాయుడు వెతికి లాభంలేదు. నన్ను కనిపెట్టినా చేసేదేం లేదు. పోలీసులకు రిపోర్టు చెయ్యడని నా నమ్మకం.

గవర్నమెంటు శాసనం ప్రకారం కట్నం యివ్వడం నేరం కదా? మరింకేమని నా మీద కంప్లెయింట్ చేస్తాడు? నేను ఆయనగారి డబ్బు తీసుకున్నానని రుజు వెక్కడుంది?

మెడ్రాస్ వాతావరణం నాకు కొంచెం కొత్తగా ఉంది. జనం అరవం మాట్లాడుతున్నారు. నాకు అరవం రాదు. ఇంగ్లీలో సంభాషణ జరుపుతున్నాను.

నేను దిగిన ఫైవ్ స్టార్ హోటల్ మేనేజర్ చెప్పాడు త్యాగరాయనగర్‌లో అంతా తెలుగు వాళ్ళుంటారని, అక్కడేదైనా ఒక యిల్లు చూసుకోవాలి.

కాని నేనిక్కడ ఏం చేయదలుచుకున్నదీ ఇంకా నిర్ణయించుకోలేదు. ఒక మంచి పని చేసిన తర్వాత మరొక మంచిపని చెయ్యడానికి కొంత వ్యవధి కావాలి. వ్యూహం పకడ్బందీగా వుండాలి.

డ్రాఫ్ట్ బ్యాంకిలో జమ చేసి ఎక్కౌంట్ ఓపెన్ చేశాను. ఒక లాకర్ తీసుకుని అందులో డైమండ్ నెక్లెస్ దాచాను. సవిత తాలూకు గోల్డు హైదరాబాద్‌లోనే క్యాష్‌గా మార్చుకున్నాను.

ఇప్పుడు నేను బొంబాయిలో యేదైనా ఒక బిజినెస్ చెయ్యడానికి సరిపోయే ఆర్థిక స్తోమత కలిగి ఉన్నాను. కాని నేను వెళ్ళదల్చుకోలేదు. స్వర్ణ ఫాదర్ ఫ్యాక్టరీ లాంటి ఫ్యాక్టరీ పెట్టాలని నిశ్చయించుకున్నాను. అందుకు ఇంకా డబ్బు కావాలి.

హోటల్లో వుంటూ సిటీతో పరిచయం చేసుకుంటున్నాను. టాక్సీలో నేను చూడదల్చుకున్న ప్రదేశాలకు వెళ్తున్నాను. టోపీ పెట్టి, ఫుల్‌సూట్‌లో పెద్ద బిజినెస్ మ్యాగ్నెట్‌లా ప్రవర్తించసాగాను. నా పేరు కిషన్, ఢిల్లీనుంచి వ్యాపారం నిమిత్తం వచ్చాను, అని హోటలు విజిటర్స్ రిజిష్టర్లో రాశాను.

ఒకరోజు మహాబలిపురంలోగడిపాను ఒక కాటేజీలో. నాకు కాలం బాగానే గడిచింది. హోటల్‌బాయ్ ఎక్కువ రేటుకి ఒక హాఫ్‌బాటిల్ విస్కీ తెచ్చిపెట్టాడు. ఈ స్టేట్‌లో తాగడానికి బ్యాన్ వుందట. సిటీలో ఎక్కడా షాపులు లేవు.

సాయంత్రం ఏమీ తోచక మెరీనాబీచ్‌లో కూర్చున్నాను. ఏడింటివరకూ ఇసుకలో కాలక్షేపం చేశాను సుండల్ తింటూ. నేను గమనించలేదుగాని బాగా మబ్బు

పట్టింది. చినుకులు మొదలయ్యాక గాని తెలిసిరాలేదు. పెద్ద పెద్ద చినుకులతో వర్షం సడన్‌గా వచ్చేసింది. నేను పరిగెత్తాను. ఇసుకలో నా బూటు దిగి పోతోంది.

రోడ్డుమీదకు వచ్చేసరికి నా బట్టలు తడిసిపోయాయి. చల్లటి గాలికి వణుకు పుడుతోంది. అసలు ప్రొద్దుట్నుంచి మబ్బులు పట్టి చలిగాలిగానే ఉంది. దానికి తోడు వాన.

ఏదయినా టాక్సీ గాని, ఆటో గాని దొరికితే బాగుం డేది. వెంటనే దొరకలేదు. ఎలా దొరుకుతుంది? ఇక్కడ కథ మరో మలుపు తిరిగింది.

రోడ్డు దాటి అవతలకి పోదామని గబగబా అడుగులు వేస్తుంటే నా దృష్టి ఒక నల్లటి అంబాసిడర్ కారుమీద పడింది. మౌంట్ రోడ్ వరకూ ఎవరైనా లిఫ్ట్ ఇస్తే బ్రతికి పోతాను. లేదా పారిస్ వరకూ అయినా ఫరవాలేదు.

కారులో ఎవరో మార్వాడీ పడుచు వుంది. ఆమె నారింజరంగు దుస్తుల్లో బంగారు రంగులో ధగధగ లాడి పోతూ వుంది.

"ప్లీజ్! కొంచెం లిఫ్ట్ ఇస్తారా? నేను మౌంట్ రోడ్‌కి వెళ్ళాలి" అన్నాను హిందీలో. ఆమెకు వినిపించలేదను కుంటాను.

వెళ్ళిపొమ్మని చేతితో సైగ చేస్తోంది.

ఆమె ఎందుకో భయపడుతున్నట్లు, ఆమె ముఖంలో ఆందోళన, కలవరం నేను గ్రహించును. ఒంటరిగా కారులో ఆమె ఎందుకుంది? మగవాళ్ళు బీచ్‌లో వున్నారా? ఈమె కారులోనే ఎందుకుంది? ఒకవేళ కుంటిదా?

నేను డోర్ తియ్యమని సైగ చేశాను. ఆమె కొంత

సేపు నన్ను అనుమానంతో చూసింది. నేనేమో తడిసి పోతున్నాను. వర్షం పెద్దదైంది. ఆమె ఏమనుకుందో ఏమో? డోర్ కొంచెం తీసి "క్యా హై?" అంది.

"నేను మౌంట్ రోడ్డుకి వెళ్ళాలి. కొంచెం లిఫ్ట్ ఇస్తారా? టాక్సీ, ఆటో దొరకడంలేదు. నేను బొంబాయి వాలాని" అని హిందీలో చెప్పాను.

ఆమె వెంటనే తలుపు తీసింది. నేను లోపల కూర్చుని తలుపు వేశాను.

"కారు చెడిపోయింది" అంది ఆమె.

"అలాగా!" అన్నాను నిరుత్సాహంతోటి.

"ఆఁ....ఏం చెయ్యాలో తోచడంలేదు. వర్షం ఆగేటట్లు లేదు" అంది దిగులుగా.

"మీ మగవాళ్ళు ఎక్కడ?"

"లేరు. నేనే డ్రైవ్ చేస్తున్నాను."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"నెల్లూరు."

"మీరు మద్రాసులో వుండడం లేదా?"

"లేదు. బిజినెస్ గురించి మా అన్నలిద్దరూ నేనూ ఇక్కడికి వచ్చాం. వాళ్ళిద్దరూ కోడంబాకంలో తప్పిపోయారు" అంది.

నాకు ఆశ్చర్యం కలిగింది.

బిజినెస్ గురించి వచ్చినవాళ్ళు తప్పిపోవడమా? ఆమె అబద్ధం చెప్తుందని నేను వెంటనే గ్రహించాను. ఆమె యెందుకు ఒంటరిగా వుంది? ఆమె అన్నలు ఏమయ్యారు? నా తలలో రకరకాల అనుమానాలు.

"మరి మీరిప్పుడు ఏం చేస్తారు?"

ఆమె ఏమీ చెప్పలేదు.

"నా పేరు కిషన్. నేను మీవాడినే" అన్నాను.

ఆమె ముఖం ప్రసన్నమైంది. నేను బొంబాయిలో వ్యాపారం చేస్తున్నాననీ మద్రాస్ చూడ్డానికి వచ్చానని చెప్పాను. ఆమె పేరు శాంతి అట. ఇంకా పెళ్ళికాలేదు. నాకు అది చాలు ఆడపిల్లను లొంగదీయడానికి.

"నేను వుంటున్న హోటల్ కి రండి" అన్నాను.

"నై.... నై...." అంది కీచుమని అరుస్తూ.

"ఏం? నేను ఏదైనా చేస్తానని భయమా?"

"అదికాదు. ఏ హోటల్ కీ వెళ్ళొద్దని మా అన్నలు చెప్పారు. నెల్లూరునుంచి యెప్పుడు వచ్చినా రాత్రికి తిరిగి వెళ్ళిపోతాం" అంది శాంతి.

"ఏం వ్యాపారం మీది?"

శాంతి చెప్పలేదు. నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా మాట మార్చి ఏదో చెప్పసాగింది. నేను అనుమానించినట్లు ఏదో గూడుపుఠాణీ వున్నట్లుంది.

కారులో వున్న గొడుగు తీసుకొని బాయినెట్ ఎత్తి కారు యెందుకు ఆగిందో చూడసాగాను. నాకు కారు మెకానిజం తెలిసినందుకు ఆమెకు ఆనందం కలిగింది. పెట్రోల్ పంపు పని చెయ్యడంలేదు. ఒక ఐదు లీటర్ల డబ్బాలోకి టాంక్ లోనుంచి పెట్రోలు లాగి టెంపరరీ అరేంజ్ మెంట్ చేశాను. శాంతి సీటుపైన డబ్బా పట్టుకుని కూర్చుంటే నేను కారు నడిపాను.

"కారు యెక్కడికి పోనివ్వమంటారు?"

"నెల్లూరు వెళ్ళాలి నేను" అంది.

"మరి మీ బ్రదర్స్."

"వాళ్ళు తర్వాత వస్తారు."

"ఈ వానలో రాత్రి పూట అంత అర్జెంటుగా

వెళ్ళాలా?"

ఆమె తల వూపింది.

నేను కేవలం ఆమెకు డ్రైవర్‌గా అంత దూరం వెళ్ళి నందువల్ల లాభం వుందా లేదా? అని ఒక్క క్షణం ఆలోచించాను. ఏమైతే అది అవుతుందని వెళ్ళడానికి నిశ్చయించుకున్నాను. ప్రతి పనిలోనూ లాభం వెతకడం ఘోరం కదా?

ప్రెష్‌గా వుంది శాంతి. యెంత డబ్బు ఖర్చుపెట్టినా మందార పువ్వులాంటి ఫ్యామిలీ గర్ల్ యెక్కడ దొరుకుతుంది? ఈ కారు యెక్కడో దిగేసి తెల్లవారే లోపల ఒక్క అనుభవం పొందలేక పోతానా అనే ఆలోచనతో కారు స్టార్టు చేశాను.

"భోజనం చేసి బయల్దేరదామా?" అన్నాను.

"నాకేమీ వద్దు!" అంది శాంతి.

"నెల్లూరు వెళ్ళేటప్పటికి ఆలస్యమై పోతుందేమో? ఆకలి వెయ్యదూ?"

"ఫరవాలేదు. మీకు కావాలంటే భోజనంచేసి రండి వెళ్దాం" అంది శాంతి.

కారు మెరీనా బుహారిలోకి తీసికెళ్ళాను. ఆలోచనలతో నా బుర్ర తిరిగిపోతోంది. శాంతి యెంత బ్రతిమాలినా కారు దిగడానికి ఒప్పుకోలేదు. ఆకలి గూడా సహించి కారులోనే పాతుకుపోవడానికి కారణం ఏమిటి? ఒకవేళ కారులోనే ఏదైనా విలువైన....?

మనసులో ఒక మెరుపు మెరిసింది. కరెక్టు. కారులో ఏదో అమూల్యమైన వస్తువు వుంది. అందుకే శాంతి కారు దిగడానికి ఒప్పుకోలేదు.

బాయ్‌ని కారు దగ్గరికి పంపించాను మెనూ కార్డుతో.

కొన్ని ఐటమ్స్‌కి ఆర్డర్ యిచ్చింది. నా అనుమానం నిజమైంది. ఆమెకు ఆకలి లేక కాదు. ఏదో వుంది. ఏం వుంటుంది?

ఒకవేళ స్మగుల్డు గుడ్సుగాని కారులో లేవుగదా? ఆమె అన్నలు దొరికిపోతే తను ఇంటికి వెళ్ళిపోతున్నదేమో?

లేనిపోనివి సగ్ముల్డు కేసులో ఇరుక్కోను గదా? అనే అనుమానం పీడించింది. నేను పోలీసుల దృష్టిలో పడడం నా అభివృద్ధికి ఆటంకం. సంగతేమిటో తెలుసుకునిగాని చెక్ పోస్టు దాటగూడదు. ఇటువంటి వ్యవహారాలు అక్కడే బైట పడతాయి.

కొంతదూరం పోయిన తర్వాత రోడ్డు ప్రక్కన కారు ఆపాను. సిటీ వదిలి దూరంగా వెళ్ళాక ఆ పని చేశాను. కారు ట్రబుల్ యిచ్చినట్లు యాక్టు చేశాను.

## 8

టైమ్ యెనిమిదిన్నర దాటింది.

వర్షం ఆగలేదు. ఈదురు గాలి వీస్తోంది.

కారు లైటు డిమ్ముగా వెలుగుతోంది. హెడ్ లైట్లు ఆపేసి కూర్చుని సిగిరెట్ నోట్లో పెట్టుకున్నాడు.

"ఇఫ్ యూ డోంట్ మైండ్" అన్నాను లైటర్ వెలిగించాక.

"ఫరవాలేదు" అంది శాంతి.

"ఇక చెప్పండి" అన్నాను.

"ఏమిటి?" అంది ఆమె.

"మీరింతవరకూ చెప్పినవన్నీ అబద్ధాలే" నవ్వాను.

శాంతి నివ్వెరపోయింది.

"ఏమిటి మీర నేది?"

"అవును. అబద్ధం యెందుకు చెప్పారు?"

"ఏమిటి అబద్ధం?"

"మీరు చెప్పినవన్నీ."

"కాదు.... కాదు...."

"చూడండి మిస్ శాంతీ. నేను దుర్మార్గుడిని కాను. పైగా మీ జాతివాడిని. నాతో నిజం చెప్పవచ్చుగా. మీకు యెటువంటి సహాయం చెయ్యాలన్నా సిద్ధంగా వున్నాను" అన్నాను.

శాంతి కొంచెం కంగారు పడింది. తర్వాత సర్దుకుంది. కాని అసలు సంగతి మాత్రం చెప్పలేదు. తను చెప్పిం దంతా నిజమేనని బుకాయించింది. సరే నేనూ మొండిగా వుండదల్చుకున్నాను.

"కారు పోనివ్వండి" అంది తర్వాత.

"పెట్రోలు అందడంలేదు. కొంచెంసేపు ఆగాక మళ్ళీ చూస్తాను" అన్నాను.

"మళ్ళీ ఏమైంది?" అంది కంగారుగా.

"అదే ట్రబుల్" అన్నాను.

"బాగవుతుందా? మనం నెల్లూరు వెళ్ళగలుగుతామా?"

"ఆఁ.... ఇలాగే మజిలీలు చేసుకుంటూ వెళ్ళొచ్చు."

ఆమె నిట్టూర్చింది.

"యెలాగో వెళ్ళేసరి" అంది.

"రెంచీలు కావాలి. డిక్కీ తలుపు తియ్యాలి. కీస్ వేరే వున్నాయా? దీనికి రావడం లేదు" అన్నాను.

"వేరే వున్నాయి.... పదండి" అంటూ గొడుగు తీసు కుని కారు దిగింది శాంతి.

నేనూ ఆమె వెంట దిగాను. డిక్కీ తెరిచింది.

అందులో రెండు సూట్ కేసులు వున్నాయి. రెండూ వి. ఐ. పి. సూట్ కేసులే. వాటిలో వుండొచ్చు స్మగుల్డు వస్తువులు.

రెంచీలు తీసుకుని బాయినెట్ ఎత్తి ఏదో రిపేర్ చేసినట్లు నటించాను.

మళ్ళీ కారు బయల్దేరింది.

ఒక గంటవరకూ శాంతి కళ్ళు మూసుకుని పడుకుంది. తర్వాత ఆవులిస్తూ లేచింది.

"ఎంత దూరం వచ్చాం?" అంది.

"ఏదో టౌన్ లా వుంది" అన్నాను.

"ఆఁ.... అది గూడూరు" అంది శాంతి.

"అడగాలని మర్చిపోయాను. ఆ సూట్ కేసుల్లో ఏమున్నాయి?" ప్రశ్నించాను.

శాంతి వులిక్కిపడింది.

"బట్టలు వున్నాయి."

"సైట్ వాల్లు చెయ్యనివాళ్ళు బట్టలెందుకు తెచ్చారు?"

"అవన్నీ పాంట్, షర్టు పీసెస్,"

"స్మగుల్డా?"

"కాదు.... కాదు. పారిస్ కార్నర్ లో కొన్నాం. నెల్లూరులో మాకు క్లాత్ షాపు వుంది."

"నేను వాటిని చూడొచ్చునా? నాకు రెండు జతలు కావాలి. డబ్బిస్తా లెండి" అన్నాను.

"నెల్లూరు వెళ్ళాక అలాగే చూద్దురుగాని లెండి" అంది శాంతి.

"కాదు. ఇప్పుడే చూస్తాను."

"అవేం రెడీమేడ్ అనుకుంటున్నారా? ఎందుకంత

తొందరపడుతున్నారు?"

"నేనంతే. అనుకున్న వెంటనే కావాలి ఏదైనా?" అన్నాను.

శాంతి సమాధానం చెప్పలేదు. టౌన్ దగ్గరికివస్తోంది.

"గూడూరులో పోలీస్ స్టేషన్ ఎక్కడుందో మీకు తెలుసా?"

"ఎందుకు?" కంగారుగా అడిగింది శాంతి.

"కారు అక్కడికి పోనివ్వడానికి."

"కారు పోలీస్ స్టేషన్‌కి ఎందుకు?" ఆమె గొంతు బొంగురుపోయింది దెబ్బకి.

"కారులో స్మగుల్డు గుడ్స్ వుంది గనుక" అన్నాను కటువుగా.

నేను వేసిన ఎత్తుకి చిత్తైపోయింది శాంతి.

"నో....నో.... మిస్టర్ కిషన్ అలా వద్దు" అంది నా ప్రక్కకి జరుగుతూ. నా చేతిమీద చెయ్యివేసి కళ్ళలోకి చూసింది.

నేను ఆమె భుజంమీద చెయ్యివేసి దగ్గరికి లాక్కున్నాను. శాంతి తల నా భుజంమీద ఆనించి కళ్ళు మూసుకుంది.

నేను కారుకి బ్రేక్ వేసి హెడ్ లైట్లు ఆపేశాను. చుట్టూ చిమ్మచీకటి.

శాంతిని అమాంతం కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాను. ఆ చలిలో, వర్షంలో ఆమె కౌగిలి ఎంత హాయిగా వుందో చెప్పలేను. ఆమె పెదవుల్లో తేనెలూరుతున్నాయి. వెనుకనుంచి ఏదో లారీ వస్తున్నట్లు వెలుగు కిరణాలు బ్యాక్ అద్దంనుంచి మా మీద పడ్డాయి. శాంతి సిగ్గుపడుతూ నన్ను వదిలించుకుంది.

నాకు తెలుసు లొంగిపోతుందని. తనను తాను రక్షించు కోవడానికి, నన్ను ట్రాప్ చెయ్యడానికి ప్రయత్నిస్తోంది.

ఆమె శరీరంనుంచి వస్తున్న సువాసనకు నాకు మైకం కలుగుతోంది. లాభంలేదు. నన్ను కంట్రోలు చేసుకోలేను. ఆమె నాకు కావాలి. నెల్లూరు వరకూ వెళ్ళడం జరిగితే ఆమె నాకు దక్కేది వట్టిమాట. గూడూరు దాటాక ట్రంక్ రోడ్డులోనుంచి మట్టి రోడ్డులోకి కారు మళ్ళించాను. అదేదో పల్లెకుపోయే రోడ్డయి వుంటుంది. ఆ చుట్టుప్రక్కల నరమానవుడు సంచరించడు. కొంత దూరం పోయాక వేపచెట్లు గుబురుగా కన్పించాయి. రోడ్డు ప్రక్కనే పెద్ద బావి. అన్నీ పొలాలు.

కారు ఆపాను.

"ఏమిటిది?" నర్మగర్భంగా నవ్వింది శాంతి.

నేను హెడ్ లైట్లు కారులో లైటు ఆపేసి బ్యాక్ సీట్లోకి దూకాను. ఆమెను రెండు చేతులతోటి వెనక్కి లాక్కున్నాను.

మళ్ళీ గంటవరకూ మేమీ లోకంలోకి రాలేదు. శాంతి అలసిపోయి మత్తుగా పడుకుని వుంది. నేను ఫ్రంట్ సీట్లోకి వెళ్ళి సిగిరెట్ వెలిగించాను. శాంతి వివస్త్రగా వుండి వుంటుంది. ఆమె అందం చూడాలనుకున్నాను. లైటు వేశాను. గోవా బీచిలో నగ్నంగా సూర్యస్నానం చేస్తున్న యూరోపియన్ సుందరిలా హాయిగా పడుకుని వుంది శాంతి. ఆమె నిద్రపోతున్నట్లుంది.

నా దృష్టి కీ ఛైన్ మీద పడింది. ఆ సూట్ కేసులో ఏమున్నాయో చూడాలని ఆకాంక్ష కలిగింది. చప్పుడు చెయ్యకుండా కీ చైన్ అందుకుని కారు దిగాను. వర్షం

లేదు. చలిగాలి మాత్రం దంచుతోంది. చెమటపట్టిన శరీరానికి హాయిగా వుంది.

డిక్కీ తెరిచాను. సూట్ కేసులు రెండూ తెచ్చి కార్లో పెట్టి తెరిచి చూశాను. నా కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. అన్నీ బంగారు నగలు. సరి క్రొత్త నగలు' నెక్లెస్‌లు, గాజులు, చెవి దుద్దులు. నేను బిత్తరపోయి చూస్తుంటే శాంతికి మెలకువ వచ్చినట్లుంది. లేచి చూసింది.

"ఓహ్! మిస్టర్ కిషన్. అవెందుకు తీశావు? ఎవరైనా చూస్తే ప్రమాదం!" గట్టిగా అరిచింది.

"ఇక్కడికి ఎవరు వస్తారు?" అన్నాను.

"ఏమో! ఎవరైనా రావచ్చు" అంటూ ఆమె బట్టలు కట్టుకుంది కంగారుపడుతూ.

"ఎక్కడివి ఇవన్నీ? ఏదైనా షాపు లూటీచేశారా? మీది దొంగల బ్యాచి కదూ?"

"కాదు....కాదు కిషన్. నేను నిజం చెప్తాను" అంది శాంతి.

"చెప్పు."

"అవన్నీ మావే. మావి జ్యావెలరీ షాపులు నెల్లూరులో వున్నాయి. అప్పుడప్పుడూ స్మగ్లర్లుగా బంగారు బిస్కెట్లు బొంబేనుంచి తెప్పించి నగలు తయారు చేయిస్తాము' మెడ్రాస్‌లో మాకు చాలామంది కస్టమర్స్ వున్నారు' మా బ్రదర్స్ వాళ్ళ దగ్గిర ఆర్డర్స్ తీసుకుని నగలు చేయిస్తారు. ఇదంతా బ్లాక్ వ్యాపారం. ఆడపిల్ల వుంటే ఎవరికీ అనుమానం రాదని నగలు తీసికెళ్ళినప్పుడు నేనూ వెంట వెళ్తాను. ఎవరైనా పసిగట్టినప్పుడు నేను కారు నడుపుకుని నెల్లూరు పారిపోతాను."

"వూఁ ...ఈ రోజు ఏం జరిగింది?"

"ఆర్డర్స్ ఇచ్చిన నగలు ఇవ్వడానికి మా బ్రదర్స్ ఇద్దరూ ఒక బిల్డింగ్‌లోకి వెళ్ళారు. అక్కడ వాళ్ళని పోలీసులు పట్టుకున్నారు. వాళ్ళ దగ్గిర ఎక్కువ వుండవు, అన్నీ సూట్‌కేసుల్లోనే వుంటాయి. మా చిన్న అన్న నాకు సైగచేశాడు. నేను కారులో ఒంటరిగా పారి పోతూ వుంటే కారు చెడిపోయింది. ఆ తర్వాత మీకు తెలిసిందే. నేను నెల్లూరు వెళ్ళి మా ఫాదర్‌కి చెప్తే రేపు వెళ్ళి వాళ్ళని విడిపిస్తారు" అంది శాంతి.

"అయితే ఇదంతా పాపిష్టి సొమ్ము అన్నమాట" అన్నాను.

"సొమ్ము మంచిది పాపిష్టిదీ అని ఏముంది? అంతా ఒకటే" అంది శాంతి.

నేను ఆలోచనలో పడిపోయాను. అంత బంగారం చూస్తూ, చూస్తూ వదలాలంటే నా ప్రాణం గిలగిల లాడుతోంది. వాటిని దక్కించుకునే మార్గం ఏమిటి?

"శాంతీ!"

"వూఁ...."

"నా మాట వింటావా?"

"ఏమిటి?"

"నీకు ఎంతమంది మగవాళ్ళతో సంబంధం వుంది?"

"లేదు కిషన్....నువ్వే మొదటివాడివి—ఏమిటో ఇలా జరగాలని దేవుడు రాసినట్లున్నాడు. కిషన్ నేనింత వరకూ ఎవర్నీ ప్రేమించలేదు. నిన్నే....నిన్నే.... మొదటి సారిగా! కిషన్ ఏమిటో నిన్ను చూస్తూవుంటే నేను ప్రపంచం మర్చిపోతున్నాను. ఐ లవ్ యూ కిషన్!"

నవ్వాను శాంతి మాటలకు. ఇటువంటి మాటలు ఎంత

మందితో చెప్పివుంటుందో బద్మాష్!

"ఆల్ రైట్ శాంతీ! వూరికే అన్నాను బాధపడకు" అన్నాను.

శాంతి సూట్ కేసులు మూసి లాక్ చేసింది.

"శాంతీ!"

"వూఁ...."

"నాకూ మొదటి అమ్మాయివి నువ్వే. ఈ రాత్రిని నా జన్మలో మర్చిపోలేను. ఎంత తియ్యటి రాత్రి" అంటూ కౌగలించుకుని ముద్దుపెట్టుకున్నాను.

శాంతి ఆనంద పారవశ్యంలో కళ్ళు మూసుకుంది.

"నువ్వు గులాబీ పువ్వులా ఎంత అందంగా వున్నావు శాంతీ!"

"నిజంగా కిషన్."

"నిజం శాంతీ! బొంబాయి మొత్తంలో నీ అంత అందమైన అమ్మాయిని చూళ్ళేదంటే నమ్ము!"

శాంతి కిలకిలా నవ్వింది.

ఆమె నా మాటలకు వుబ్బిపోతోందని తెలుసుకున్నాను.

"శాంతీ మనం మెడ్రాస్ వెళ్ళిపోదాం" అన్నాను.

శాంతి వులిక్కిపడింది.

"ఎందుకూ?"

"మనకి ఈ రోజే దేవుడిసాక్షిగా పెళ్ళి, శోభనం జరిగిపోయాయి. మనం ఇప్పుడు భార్యాభర్తలం అవునా?"

శాంతి అయోమయంగా తల వూపింది.

"మనం జీవితాంతం కలిసివుందాం శాంతీ!"

"ఓ....కిషన్. అలాగే. కాని ముందు మనం నెల్లూరు వెళ్ళాలి. తర్వాత మా నాన్నకు చెప్పి పెళ్ళి చేసు

కుందాం."

"అదంతా జరిగే పనికాదు శాంతీ. మనం మద్రాస్ వెళ్ళి తర్వాత ప్లెయిన్‌లో బాంబే పోదాం. ఈ నగలు అమ్ముకుని హాయిగా వుందాం" అన్నాను.

శాంతి ఒప్పుకోలేదు. ఒప్పుకోదనీ నాకు తెలుసు. ఆమె వెంట నెల్లూరు వెళ్తే ఆ సూట్‌కేసులో వున్న వాటిలో ఒక్క వుంగరం గూడా నాకు దక్కనివ్వరని నాకు తెలుసు.

అందుకే శాంతిని నిర్దాక్షిణ్యంగా సవితను చేసినట్లే చేశాను. ఆ తర్వాత ఆమె శరీరాన్ని ఆ పెద్ద బావిలో పడేశాను.

ఏం చేయను మరి? శాంతి నేను చెప్పినట్లు వింటేనా?

## 9

"అయితే మొత్తం మీరు ఈ విధంగా పదిమందిని మోసం చేశారన్నమాట" అన్నాడు రిపోర్టర్.

"అందులో ఆరుగుర్ని హత్య చేశాను."

"చాలా ఇంట్రస్టింగ్‌గా వున్నాయి మీ కథలన్నీ."

నవ్వాడు శ్యాంప్రసాద్.

"ఇంత తెలివిగా చేసిన మీరు చివరకి పోలీసులకి చిక్కి జైలు పాలు అవడం విచిత్రంగా వుంది."

"ఎంత తెలివైన వాడైనా ఎక్కడో పొరపాటు చేసి దొరకక మానడు. అయితే వాళ్ళందరూ జైలుపాలు అవడం లేదనే దానికి ఎన్నో కారణాలు వున్నాయి. అవన్నీ మీకు నేను చెప్పనవసరంలేదు. మీరు పత్రికా విలేఖరి గనుక మీకు తెలుసు."

"మీరు పోలీసులకు ఎలా దొరికిపోయారో చెప్పండి!"

"నేను స్వర్ణ ప్రేమకోసం ఇన్ని మోసాలు, హత్యలు

చేయగలిగాను. లేకపోతే చేసివుండేవాడిని కాను. ఒక సామాన్య మానవుడిగా ఈ బొంబాయి నగరంలో కాలం వెళ్ళబుచ్చి వుండేవాడిని."

"మనిషి ఒక అసామాన్య పని చేయడానికి వెనుక ఏదో ఒక ఇన్‌స్పిరేషన్ వుండితీరుతుంది. అందుకే ఒక మేధావి అన్నాడు ప్రతి గొప్ప పని వెనుకా ఒక స్త్రీ వుంటుందని" అన్నాడు రిపోర్టర్.

"అయితే నేను చేసినవన్నీ గొప్ప పనులేనా?" నవ్వాడు శ్యాంప్రసాద్.

"ఇండియాలో పెద్ద పెద్ద నగరాలలో డబ్బున్న వాళ్ళని మోసం చెయ్యడం గొప్ప పనే."

"యెన్ని చేసినా నా లక్ష్యం నెరవేరలేదుగా!" అన్నాడు శ్యాంప్రసాద్ బాధగా.

"చెప్పండి యెలా దొరికిపోయారు?"

"నేను యేడాదిలో దాదాపు అరవై లక్షలు సంపాదించి బొంబాయి చేరాను. మల్బార్ హిల్స్‌లో ఒక ప్లాట్ అద్దెకు తీసుకున్నాను. షో రూమ్‌నుంచి సరికొత్త కారు కొన్నాను. దర్జాగా డ్రైవ్ చేసుకుంటూ స్వర్ణ ఫాదర్‌ని కలుసుకోవడానికి కంపెనీకి వెళ్ళాను.

"నన్ను, నా దర్జానీ చూసి ఆయన అదిరిపోయాడు. నేను త్వరలోనే ఆ పరిసరాలలో ఒక ఫ్యాక్టరీ ప్రారంభించబోతున్నాననీ మీరు సహాకరించాలని అడిగాను. ఆయన డబ్బు యెక్కడిది, యేమిటి అని నన్ను అడగ లేదు. సరే అన్నాడు. నా కోసం కూల్ డ్రింక్స్ తెప్పించాడు. ఫ్యాక్టరీ ప్రారంభించడానికి అవసరమైన సలహాలు ఇచ్చాడు. ఇక ఆయన దగ్గర్నుంచి సెలవు తీసుకుని స్వర్ణని కలుసుకోవడానికి వాళ్ళ ఇంటికి బయల్దేరాను.

కాని మధ్యలోనే నా కారుని పోలీసులు చుట్టు ముట్టారు. నాకు ఆశ్చర్యం వేసింది. నా వునికి వీళ్ళకు ఎలా తెలిసింది. నన్ను యే ఆధారంతో అరెస్టు చేశారని? తర్వాత తెలిసింది నేను బయల్దేరగానే స్వర్ణ ఫాదర్ పోలీసులకు ఫోన్ చేసి నేను డ్రైవ్ చేస్తున్న కారు నెంబర్ చెప్పాడని.

నేను బుజువయ్యేటట్లు యే నేరమూ చెయ్యలేదు. కాకపోతే నా దగ్గరవున్న డబ్బు యెక్కడిదని పోలీసులు అడగవచ్చు. ఆ డబ్బు నా ఫ్లాట్ లో లేదు. అంతకు ముందే మరొక ఫ్లాట్ అద్దెకు తీసుకుని భూస్థాపితం చేసి వుంచాను. యెవరూ కనుక్కోలేరు. నేను ధైర్యంగా వున్నాను. నేరాలు యెవరూ బుజువు చెయ్యలేరని.

కాని డాక్టర్ సవితను హత్య చేసినపుడే నేను దొరికి పోయానని తెలిసింది. ఆమెకు డైరీ రాసే అలవాటు వుంది. నేను వినోద్ పేరుతో అక్కడ వున్నట్లు, నేను చెప్పిన ప్రేమ కథ అంతా డైరీలో రాసింది. నా అసలు పేరు నేను పనిచేస్తున్న కంపెనీ, నేను ఆ వీధిలో వుంటున్న రూమ్ వివరాలు అన్నీ రాసింది.

మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలన్న విషయం, బ్యాంక్ లో డబ్బు డ్రా చెయ్యడం అన్నీ....అక్షరం, అక్షరం రాసిపెట్టింది....ఆమెను హత్య చేసినట్లు ఒప్పుకోక తప్పని పరిస్థితి కలిగింది...." దీనంగా అన్నాడు శ్యాం ప్రసాద్.

"ఐ పిటీ యూ!" అన్నాడు రిపోర్టర్ సానుభూతిగా చూస్తూ.

—:ఐపోయింది:—

# తిరిగివచ్చిన దొంగ

## సికిందర్

శాంతి నగర్ బస్ స్టాప్ ప్రక్క వీధిలో కారు తిప్పుతూ లాల్, తన ప్రక్కనే పరధ్యానంగా కూర్చున్న జాన్ కేసి చూశాడు.

"వెల్ పార్ట్‌నర్. ఏం చేస్తున్నావ్?"

జాన్ తల తిప్పకుండానే పరధ్యానంగా, "ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"ఏమాలోచిస్తున్నావ్?" లాల్ అడిగాడు మళ్ళీ.

"వాతావరణం ఈ రోజు ఎందుకింత మబ్బుగా వుందని."

లాల్ ఈసారి ఎగాదిగా చూశాడు. "నువ్వే లోకంలో వున్నావ్?"

"ఈ లోకంలోనే.... దేనికి?" అదే పరధ్యానంలో అడిగాడు జాన్.

"ఎండ తీవ్రంగా కాస్తోంది" లాల్ అన్నాడు అసహనంగా.

"అయితే?"

"అయితే ఏమిటి! నీ కళ్లు చీకట్లు కమ్మాయి. నువ్వీ లోకాన్ని నల్లటి గాగుల్స్ లోంచి చూస్తున్నావని సెన్స్ వుందా?"

"ఓహ్, అవును... నేనేదో పరధ్యానంలో వున్నాను."

"ఆ గంతులు తీసెయ్, గజదొంగలా వున్నావ్?"

"నెవర్ మైండ్, నేనెలా వున్నా కేర్ చెయ్యను."

"జనం చేస్తారు, నిన్ను పట్టుకొని పచ్చడి—"

"ఓ.కే! ఈ నత్త నడక ఏమిటి? నువ్వు మాటల్లో డ్రైవింగ్ మర్చిపోతున్నావు."

లాల్ వేగం పెంచి సూటిగా చూశాడు. "సరిగా చూడు, ఈ వీధేనా?"

"ఇదే వీధి, నువ్వు తిన్నగా పోనివ్వు."

"వెల్, ఏ ఇల్లో చూసి చెప్పు."

"చూస్తున్నాను, నిజం చెప్పాలంటే నీ గురించే ఆలోచిస్తున్నాను, లాల్."

"ఏమాలోచిస్తున్నావ్?"

"బొంబాయి వెళ్తానని చెప్పి ఇక్కడ కొత్త కేసుల్లో కమిట్ అవుతున్నావెందుకని!"

"నేను బొంబాయి వెళ్తానన్నది రేపు రాత్రి కదా?"

"అవును. కానీ ఈ తీసుకోబోయే కేసు నిన్నాపేసే?"

"ఎలా తెలుసు, అసలు కేసేమిటో తెలియనిదే? ఏ కేసూ నన్నాపదు, నువ్వుండగా. నువ్వు హేండిల్ చేయలేవా?"

"నా బ్రెయిన్ అప్పుడప్పుడు మాత్రమే చురుగ్గా పని చేస్తుంది."

"అవును, ఆ జాడ్యం వదిలించుకోకపోతే అంతే మరి!"

"ఓ,కే., ఇంకా ముందుకెళ్ళకు! ఇక్కడా పేయ్."

లాల్ కారాపేశాడు. ఇద్దరూ దిగి ఆ ఇంటికేసి చూశారు. చిన్న డాబా యిల్లు. లోన ఎవరూ కన్పించ లేదు. తలుపు మూసివుంది.

చటుక్కున తలుపు తెరచుకోవడంతో జాన్ ముందుకు తూలాడు. ఆమె చరచరా నడచి వస్తోంది. గేటు దగ్గర కొచ్చి నవ్వి గడియ తీసింది.

"మా అమ్మ లోనికి రమ్మంది" అందామె.

ఆమె కంఠస్వరం జాన్ కెంతో నచ్చింది. పరికించి చూశాడు. పద్దెనిమిదేళ్ళు. 5'5". చామనఛాయ రంగు. గుండ్రటి ముఖం. కళ్ళు నల్లటివి. పెదవులు పల్చటివి. జడ పొడవాటిది. బ్లూ కలర్ లంగా, అదే రంగు జాకెట్ పసుపు రంగు వోణీ: ఎక్సలెంట్ క్రియేషన్. తృప్తిచెంది లాల్ ని చూశాడు.

"మా అమ్మ లోనికి రమ్మంది" మళ్ళీ అందామె.

"మేం లోనికి రావడానికే ఇక్కడ నిల్చున్నాం!" జాన్ అన్నాడు భుజాలెగరేసి.

లాల్ అతని వీపు మీద గట్టిగాచరిచి లోనికి నడిచాడు.

లోపల ముందు గదిలో, యాభై పైపడ్డ ఓ స్త్రీ ఫ్యాను రెగ్యులేటర్ త్రిప్పుతూ కన్పించింది. వెనుకనుంచి లాల్ 'నమస్తే!' అనడంతో గిరుక్కున తిరిగి ముఖంలో అంతవరకూ వున్న భయందోళనల్ని ఒక ప్రక్క పెట్టేసి, చిరునవ్వు వెల్గించి పలకరింపుగా నవ్వింది. "నమస్తే, కూర్చోండి."

ఆమె గొంతులో వణుకు గమనించాడు లాల్

కూర్చుంటూ. ఆమెకేసి తేరిపార చూశాడు. ఫ్యాను గాలికి వెంట్రుకలు ముఖంమీద పడుతోంటే ఆమె చీద రింపుగా వెనక్కి సవరించుకుంటోంది. వెంట్రుకలు చాలా వరకు నెరిసిపోయాయి. ముఖం మీద చర్మం ముడతలుపడి వదులుగా, కళాకాంతుల్ని కోల్పోయి వార్ధక్యాన్ని సూచిస్తోంది. ఆమె కళ్ళక్రింద నల్లటి చారలు అద్దాల్లోంచి స్పష్టంగా అగుపిస్తున్నాయి.

ఆమె లాల్ ఎదురుగా కూర్చొని అర్థింపుగా చూసింది.

అంతలో జాన్ ఆమె వెనుక ఆ అమ్మాయి నవ్వుకుంటూ లోనికొచ్చారు.

కూతుర్ని చూసి ఆమె దగ్గరికి పిల్చి తగ్గు స్వరంలో ఏదో చెప్పింది. ఆమె తలూపి వెళ్ళిపోయింది.

డిటెక్టివ్‌లు కాచుకున్నారు.

"పిలిస్తే మీరొస్తారనుకోలేదు, ధన్యవాదాల్ని" అందామె సంభాషణ ప్రారంభిస్తూ.

"మా కంతటి టెక్కులేదు—ఎవరు పిల్చినా, ఎప్పుడు పిల్చినా వెళ్ళితీర్తాం. మాకున్న పనేమిటి? ఈ జీవితం—"

"జీవితం బాధ్యతాయుతంగా వుంటే ప్రయోజకు లవుతారు, మార్గదర్శకులవుతారు" అందామె లాల్ మాటలందుకొంటూ. "బాధ్యతలు లేని జీవితం ఎందుకూ కొరగాదు. అది విచ్చలవిడితనానికీ, సోమరితనానికీ గురుగా మిగిలిపోతుంది—పిల్లల జీవితాల్ని తీర్చిదిద్దడం తల్లిదే బాధ్యత అంటారుగానీ, తండ్రి బాధ్యత కూడా వుంది. వుండాలి. తల్లి ప్రేమ, తండ్రి భయం వున్నప్పుడే వాళ్ళ జీవితాలు సరయిన మార్గంలో నడుస్తాయి.

"నా పిల్లలకి నేనివ్వాల్సిన ప్రేమ ఇచ్చాను, ఏ లోటు

లేకుండా. కాని తండ్రి భయంలేదు. తండ్రికి శ్రద్ధలేదు. నిర్లక్ష్యం ఎక్కువ. ఎంతసేపూ వ్యాపారం. పాతికేళ్ళొచ్చిన వివేక్ ఇలా యే బాధ్యతలూ లేకుండా తిరుగుతున్నాడంటే, చెడు మార్గాలను పడుతున్నాడంటే, నిందించవల్సింది వాడ్నికాదు—తండ్రిని. వాడు చెడిపోయాడు. పూర్తిగా పాడైపోయాడు. వాడ్ని సరిదిద్దే మార్గేమోగానీ, ముందు ఈ నిర్వాకంనుంచి ఎలా తప్పించాలో తెలియడంలేదు!"

"యేం జరిగింది?" లాల్ అడిగాడు ముందుకి వంగి, "అతనేం చేశాడు?"

ఆమె నిట్టూర్చింది. "వాడెవర్నో ప్రేమిస్తున్నాడట. అదీ అన్య కులస్థురాల్ని! ఉదయమే చెప్పాడు. మూడ్నెల్లుగా పరిచయమట. కలిసి తిరుగుతున్నారట. ఆమెనే చేసుకోవాలను కొంటున్నాడట .... ఇంతవరకూ వాడి బయటి వ్యవహారాలు నాకేమీ తెలియవు! యేదీ చెప్పేవాడుకాదు, యేం చేస్తున్నాడో; ఎక్కడ తిరుగుతున్నాడో. ఇక తండ్రి సరేసరి! పట్టించుకొనే రకం కాదు. వాడ్ని దార్లో పెట్టండీ, అదుపు చెయ్యండీ అంటే—ఈ వయసులో బాధ్యతలేమిటీ నీ చాదస్తం కాకపోతే, ఈ దశలో జీవితం యే బాదరాబందీ లేకుండా హాయిగా సాగిపోవాలిగానీ! యవ్వనంలోని తియ్యదనమంతా యే ఆటంకాలూ లేకుండా చవిచూశాక అప్పుడు జీవితంలో స్థిరపడాలి—ఈ అదృష్టం నాకు లభించలేదు గనుక, నేను కోల్పోయిందేమిటో వాడి చేష్టల్లో చూసి తృప్తిపడుతున్నాను, ఇక ఫో! అని కొట్టి పారేస్తారు."

లాల్ నవ్వలేదు. జాన్ నవ్వాడు. సీరియస్‌గా లోపలి తలుపుకేసి చూస్తున్నాడు.

"అలా వుంది వరస...." అందామె మళ్ళీ నిట్టూరుస్తూ "ఉదయం వాడి ప్రేమ సంగతి చెప్తోంటే నా రక్తం సలసల మరిగింది. రెండు చెంపలూ పగులగొట్టేయా లన్నంత ఆవేశం వచ్చింది. కానీ వాడు అసలు సంగతి బయటపెట్టి నా ఆవేశమంతా ఎగరగొట్టాడు! నా నర నాడుల్లో భయాన్ని—" ఆ తర్వాత మాటలు దొరక్క ఆగిపోయిందామె.

"ఇంజెక్టు చేశాడు" లాల్ అందించాడు.

"అవును, అంతే, అలాగే అనిపించింది! నిన్న సాయంత్రం ఆ అమ్మాయితో తోటకెళ్ళాడట. అదే మొదటిసారట ఆమెని అక్కడకు తీసుకెళ్ళడం.... సరూర్ నగర్‌లో మాకు ద్రాక్షతోట వుంది. నిన్న మధ్యాహ్నం నేను స్నానానికెళ్ళినప్పుడు పరుపుకింద పెట్టిన తాళాల గుత్తి తీసి, తండ్రి బీరువాలో రివాల్వర్ తీసుకున్నాడట. దాంతో సాయంత్రం ఆమెని తీసుకొని తోటకెళ్ళాడట. ఆమెకు షూటింగ్ నేర్వాలని చాలా కాలంగా వుందట—

"ఆ మధ్య ఎప్పుడో చాలాసార్లు వాడలా రహస్యంగా రివాల్వర్ తీసికెళ్తూ అక్కడ షూటింగ్ నేర్చుకున్నాడట. ఆ సంగతి పొక్కకుండా అక్కడ పని వాళ్ళకి డబ్బిచ్చేవాడట.

తండ్రి దగ్గర ఆ రివాల్వర్ చాలా కాలంగా వుంది. ఆయన ప్రయాణాలు ఎక్కువచేస్తారు—పెద్ద పెద్ద నగరాలకి—కూడా పెద్ద మొత్తంలో డబ్బుంటుంది. రక్షణ కొరకు రివాల్వర్ కొన్నారు. కానీ ఆ ప్రయాణాలిప్పుడు మామూలై పోవడంతో, బాగా నమ్మకం ఏర్పడి, రివా

ల్వర్ ఉంచుకోవాలన్న శ్రద్ధ నశించింది.... సంవత్సరం నుంచీ అదలాగే వుంది. ఆయన మొన్ననే బొంబాయి వెళ్ళారు. రేపు రావచ్చు...." ఆమె యేదో జ్ఞాపక మొచ్చినదానిలా ఉలికిపడి, "యేం చేస్తున్నావింకా సుహాసినీ? త్వరగారా!" అనర్చింది.

"వచ్చేస్తున్నా!" లోపలినుంచి సమాధానం వచ్చింది.

జాన్ ఉలిక్కిపడి, మళ్ళీ ఆ తలుపు మీద కన్ను వేసి వుంచాడు.

ఆమె తిరిగి లాల్ వైపు చూసింది. "ఆ రివాల్వర్ తో నిన్న సాయంత్రం వాసు తోటకెళ్ళాడట. పనివాడు రాజుకి డబ్బిచ్చి సినిమాకి పంపించేశాడట. ఇంకెవరూ అక్కడ లేరు.

"అప్పటినుంచీ ఆమెకు షూటింగ్ నేర్పుతూ గంట సేపు గడిపాక చీకటి పడిపోయిందట.... అప్పుడు ఆ పేసి, ఇద్దరూ అక్కడే గడ్డిలో కూర్చొని కబుర్లు ప్రారంభించారట. రివాల్వర్ వీడి వొళ్ళో ఉందట—అంతలో యేం జరిగిందో ఆ అమ్మాయి రివాల్వర్ తన క్కావాలని లాక్కుందిట — వీడు తిరిగి అందుకోబోతే దాంతోనే నెత్తిమీద గట్టిగా బాదిందట! ఆ దెబ్బకి వీడక్కడే పడిపోయి—అంతే—అలాగే పడిపోయాడు-"

ఆమె మాటలు తుంచేసి కాఫీలతో వచ్చిన సుహాసినిని చూసింది.

లాల్ కప్పులందుకొని, "చెప్పండి, అప్పుడేమైంది?" అన్నాడు.

జాన్ ఒక గుక్క కాఫీ తాగి కళ్ళు మూసుకొని తన్మయత్వం ప్రదర్శించాడు. సుహాసిని ముసిముసిగా నవ్వుకుంది.

"అంతే, అప్పుడేమైందో వీడికి తెలియదు. చాలా సేపటికి తెలివిలోకొచ్చి చూస్తే ఆమె లేదట. రివాల్వరూ లేదట! వెంటనే స్కూటరెక్కి ఆమె ఇంటికెళ్ళాడట. ఇంటికి తాళం వుందట. ఆమె లేదు. రాత్రి రెండుసార్లు వెళ్ళినా ఆమె రాలేదట. ఉదయం తోటకెళ్ళి రివాల్వర్ కోసం వెతికాడట. దొరకలేదు. ఆ అమ్మాయి ఉదయం కూడా—ఇంతవరకూ ఇంటికి రాలేదు. ఇదంతా ఉదయం చెప్పాడు నాతో. చెప్తాంటే నాకు—"

"ఇప్పుడెక్కడ వున్నాడు?"

"అదుగో, మిమ్మల్ని పిలుస్తానంటే భయపడి ఆ గదిలో దాక్కున్నాడు."

"పిలవండి!"

ఆమె పిల్చింది గట్టిగా. కాని బదులులేదు.

సుహాసిని కదిలి ఆ గది దగ్గరకు వెళ్ళింది. జాన్ కళ్ళు మూవీ కెమేరాలా ఆమె ననుసరించాయి.

ఆమె తలుపుమీద కొట్టి అంది.

"ఒరేయ్, అలా సిగ్గుపడతావేమిట్రా! నీ అడ్వెంచర్ యేమిటో ముందుకొచ్చి చెప్పు!"

డిటెక్టివ్‌లు అటువైపు చూశారు మర్యాదగా.

గది గుమ్మంలో రింగుల జుత్తు యువకుడు ఛాతీ విరుచుకొని నిల్చున్నాడు. కానీ అతని కాళ్ళూ చేతులు మాత్రం సన్నగా వణుకుతున్నాయి పాపం.

"కమాన్ వివేక్, ఇలా వచ్చి కూర్చో" అన్నాడు లాల్.

సుహాసిని చెయ్యిపట్టి లాగడంతో ముందుకు తూలి అతను బయటికొచ్చాడు. ఆమె అలాగే లాక్కుంటూ తెచ్చి లాల్ ముందు కూర్చోబెట్టింది. అతని నుదురు

చెమట పట్టింది. పెదవులు ఎండిపోయి వణుకుతున్నాయి. చప్పరిస్తున్నాడు.

"మమ్మీ చెప్పింది నిజమేనా?" లాల్ అన్నాడు.

"ని__నిజమే__నిజమే!"

"ఆమె ఎక్కడకెళ్ళింది?"

"యేమో తేలీదు. అంతటా వెతికాను. ఎక్కడా లేదండీ సార్!"

"ఆమెదే ఊరు?"

"ఈ ఊరే."

"ఎవరమ్మాయి? యెక్కడ వుంటుంది?"

"ఆమె కెవరూ లేరు. యేదో ఉద్యోగం చేస్తోంది."

"యేం ఉద్యోగం? యెక్కడ?"

"అదీ తెలీదండి! ఆమె చెప్పలేదు. అడిగినా చెప్ప లేదు."

"ఆ రివాల్వర్ లో గుళ్ళున్నాయా?"

"మూడున్నాయి. 12 తీసికెళ్ళాను. రెండుసార్లు నింపాను. ఆమె మూడు, నేను ఆరు మొత్తం 9 కాల్చాం."

జాన్ లేచి ఫోన్ దగ్గరికి నడిచాడు.

లాల్ వివేక్ తల్లి వైపు తిరిగాడు. "రివాల్వర్ లైసెన్సు యెక్కడుంది? చూపించండి."

ఆమె లేచి లోనికెళ్ళింది.

"వెల్, వివేక్ ఆమె రివాల్వర్ తో పారిపోయిందంటావ్?"

"అంతే సార్."

"ఎక్కడికి? ఏం చెయ్యడానికి?"

"అదే తెలియటంలేదు!"

"శత్రువులున్నారా?"

"ఆమె తన గురించి చెప్పేదికాదు."

"హలో, కంట్రోల్ రూం?" జాన్ అంటున్నాడు ఫోన్లో, "నేను డిటెక్టివ్ జాన్ని మాట్లాడుతున్నాను. గుడ్ మార్నింగ్, బాగున్నాను....మీ క్రైం ఛార్టు పొజిషన్ ఏమిటి, మరో మర్డర్ పెరిగిందా నిన్న.... ఏమిటీ....ఓహ్....ఓహ్ నెవర్ మైండ్, ఏమీలేదు, థాంక్యూ."

వివేక్ తల్లి కంగారుగా తిరిగివచ్చి, "ఏం జరిగింది?" అంది.

"ఇంతవరకు ఎలాంటి దారుణం జరగలేదు, పోలీసులకి తెలిసినంత వరకూ...." జాన్ అన్నాడు.

"చూడండి లాల్, ఇప్పుడు పరిస్థితి మీ కరమైంది. ఆ అమ్మాయి రివాల్వర్తో ఏ అఘాయిత్యం చేస్తుందో-చేసుకుంటుందో! వీడి మెడకి చుట్టుకుంటుంది! అలాటిది జరక్కుండా చూడండి! వీడ్ని గండంనుంచి తప్పించండి! ఆ అమ్మాయిని పట్టుకోండి త్వరగా—ఏదీ జరక్కముందు క్షేమంగా."

"ఏదైనా ఇప్పటికి జరిగిపోయి వుంటే ఏమీ చెయ్యలేం" అన్నాడు లాల్, లైసెన్సు వివరాలు వ్రాసుకొంటూ. "కాని, జరగబోతూంటే దాన్ని నివారించడానికి శక్తి వంచనలేకుండా ప్రయత్నించగలం."

"ఆ పని చెయ్యండి. ఆమెని పట్టుకోండి! వెతకండి! గాలించండి! ఎంత డబ్బు కావాలన్నా వెనుకాడను. నా ఆందోళనంతా వీడిగురించే! వీడి వ్యవహారం వెల్లడైతే అభాసు పాలవుతాం! తలెత్తుకోలేం. ఆ అమ్మాయితో వీడి—"

లాల్ లేచాడు. "ఓ. కే. కమాన్ వివేక్, మాతో రా!"

"ఎక్కడికి?"

"అలా అలా తిరిగివద్దాం....నీతో విడిగా చాలా మాట్లాడాలి."

## 2

జాన్ కారు స్టార్టుచేసి పోనిచ్చాడు.

లాల్ వివేక్‌తో వెనుక సీట్లో కూర్చున్నాడు.

"వెల్, నువ్విక చెప్పు."

"ఏం చెప్పాలి?"

"ఆమె పేరేమిటి?"

"మార్గరెట్."

లాల్ కళ్ళు విశాలంగా చేశాడు, "క్రిస్టియనా?"

"అవును."

"చాలా సాహసించావు."

"ప్రేమ సాహసాన్ని కోరుతుంది."

"ఆ సాహసం కష్టాల్ని కోరలేదా ఇప్పుడు? ఆమె ఎక్కడ వుంటుందో చెప్పు."

"ఎందుకు? ఆమె ఇంట్లోలేదు. అక్కడికెళ్ళి ప్రయోజనంలేదు."

"నాకు పాఠాలు నేర్పుతున్నావా? ఆమె ఇల్లెక్కడో చెప్పు, కమాన్!"

"విద్యానగర్ పోనివ్వండి, చెప్తాను."

"సరే, జాన్. ముందు ఆఫీసుకు పోనీయ్. తాళం చెవులు తెచ్చుకోవాలి."

"తాళాలు డాష్ బోర్డులో ఉన్నాయి బాస్."

"వెరీ గుడ్, లెట్స్ గో!"

"ఆమె ఇంటికెందుకు సార్?"

"చూసి తరించడానికి! ఆమెతో ఎప్పటినించీ పరిచయం?"

"మూడు నెలలనించి."

లాల్ కొద్దిసేపు మౌనంగా కూర్చున్నాడు.

"వెల్, విద్యానగర్ వచ్చేసింది...." అన్నాడు జాన్ వేగం తగ్గిస్తూ.

వివేక్ తల తిప్పి చూశాడు. "అలా మహిళా సభ ప్రక్క వీధిలో పోనివ్వండి. ఎడమవైపు మూడో ఇంటి దగ్గరాపండి."

జాన్ అలా చేశాడు.

"మీరిక్కడేం చేయబోతున్నారు, మిస్టర్ లాల్?"

"సోదా చేయబోతున్నాం. ఆమె ఎక్కడకెళ్ళిందో నీకు తెలీదు, ఊహించలేవు కూడా. అందువల్ల ఇంట్లో ఉత్తరాలు వగైరా పరిశీలించాలి. ఆమె కింకెవరు తెలుసో, వారితో సంబంధలేమిటో...."

"కానీ ఇలా వెళ్ళడం తప్పుకాదా?"

"ఆమె రివాల్వర్‌తో పారిపోవడం అంతకంటే పెద్ద తప్పు."

మారు తాళాలతో తలుపుతీసి లోనికెళ్ళారంతా. రెండు గదులు, కిచెన్, బాత్‌రూమ్ ఉన్న ఇల్లు అది. ముందు గది డ్రాయింగ్ రూంలా, వెనుక గది బెడ్ రూంలా వున్నాయి.

డ్రాయింగ్ రూంని లాల్ నిశితంగా చూస్తూ ఒక చోట తక్కున దృష్టి నిలిపి అన్నాడు. "వివేక్, నీ చేతులు జాగ్రత్త. నన్నడక్కుండా దేన్నీ ముట్టుకోకు."

"ఎందుకు?" గాభరాగా అన్నాడు వివేక్.

"ఇక్కడ ఆధారాలు నాశనం చేయడం మంచిది కాదు."

వివేక్ కళ్ళు విశాలమయ్యాయి. "ఆధారాలా? యేం ఆధారాలు?"

"ఇంతకుముందు ఇక్కడెవరో సోదా జరిపారు."

వివేక్ అదిరిపడ్డాడు. "ఎలా చెప్తున్నారు?"

లాల్ చూపించాడు. "ఆ టేబిలు సొరుగులు చూడు. అవి ప్రక్క ప్రక్కన బాగానే వున్నాయి. కానీ కుడి ఎడమయ్యాయి."

జాన్ దగ్గరికెళ్ళి టేబిల్‌ని పరీక్షగా చూశాడు. "దటీజ్ రైట్, సొరుగులు మారాయి. ఈ మేజా కుడి అంచుమీద దేనితోనో గీరుకుపోయింది....కానీ మిగిలిన గాటు ఎడమ సొరుగుకుంది. కుడి ఎడమయ్యాయి. పొర పాటు లేదనుకొన్నాడేమో, మహానుభావుడెవరో!"

"అలా ఆమే మార్చిందేమో?" వివేక్ అన్నాడు.

లాల్ సొరుగులు రెండూ కర్చీఫ్‌తో లాగిచూశాడు, రెండింటిలోనూ అలంకరణ సామగ్రి తప్ప యేమీ లేదు.

"ఆమె కోసం నువ్వెన్ని గంటలకొచ్చావు రాత్రి?"

"తొమ్మిది గంటలకొచ్చాను. మరోసారి పదకొండుకి. మూడోసారి పన్నెండు దాటాక."

"నీ రాకపోకలెవరైనా చూశారా?"

"లేదనుకొంటాను. వీధి నిర్మానుష్యంగా ఉంది."

"నీ దగ్గర తాళంచెవి వుందా?"

"యెక్కడిది? లేదు."

"నువ్విక్కడికెప్పుడైనా వాచ్చావా, నా ఉద్దేశం ఇంట్లోకి?"

"ఆమె ఎప్పుడూ రానివ్వలేదు. బయటే కలుసుకొనే

వాళ్ళం."

"ఆమె ఉద్యోగ మేమిటో తెలుసుకొనే ప్రయత్నం చేయలేదా?"

"ఆ ప్రసక్తి తెస్తే దాటవేసేది. నాకామె గురించి సందేహాల్లేవు. క్రమంగా ఆమె గురించి తెలుసుకొంటున్నాను. అర్థం చేసుకొంటున్నాను. చాలా మంచిది. మేమింకా దగ్గరైతే ఏదీ దాచదనుకొంటాను" అన్నాడు వివేక్.

జాన్ గదుల్లో తిరుగుతూ సోదా ప్రారంభించాడు.

"మీరిద్దరూ కలిసి తిరుగుతున్నట్లు స్నేహితులకు తెలుసా, నీ స్నేహితులకి?"

"స్నేహాలు మానేశాను, ఆమెతో పరిచయమయ్యాక. మా గురించి యెవరికీ తెలియదనుకొంటాను."

"ఆమె స్నేహితులకి?"

"ఆమెకి స్నేహితులు లేరు."

"నువ్వు సిగరెట్లు కాలుస్తావా?"

"ఒకప్పుడు కాల్చేవాడ్ని. ఆమెతో పరిచయమయ్యాక అవన్నీ మానేశాను."

"సిగరెట్లు మానడం అంత తేలిక కాదు. తీవ్రంగా ఆందోళన కల్గితే తాగాలనిపించదా నీకు?"

"ఆందోళనా? నేనెప్పుడు...."

"రాత్రి-రాత్రంతా నువ్వు ఆందోళనగా గడిపావు."

"అయితే....?" వివేక్ అన్నాడు కలవరంగా, తిరిగి వచ్చిన జాన్‌ని చూస్తూ.

లాల్ నవ్వాడు, "యేమీ లేదు, ఈ సొరుగులో సిగరెట్ నుసి వుంటేనూ...."

వివేక్ అదిరిపడి ముందుకొచ్చాడు, "అది—అది— నేను

కాల్చానంటూరా!"

లాల్ నవ్వుతూ చూశాడు. మునివేళ్ళతో టేబిల్ మీద తాళం వేయసాగాడు.

"భయపడకు. ఆఫ్టరాల్, నుసి చూసి తాగిన మూలి చెప్పలేం కదా!" అన్నాడు జాన్ వివేక్ భుజంతడుతూ.

"అందుకని, జాన్, యెక్కడైనా పీకలు పడివున్నాయేమో చూడు! నువ్వే బ్రాండ్ కాల్చేవాడివి, వివేక్?" లాల్ అడిగాడు.

"రెండు మూడు. రీజెంట్, విల్సు, పనామా."

"మీరు లేఖలు వ్రాసుకొనేవారా?"

"లేఖలా? అవి కలుసుకొనే అవకాశాలు లేనివారికి. మాకు స్వేచ్ఛ కావల్సినంత వుంది. ఆమె కెవరూ లేరు, నన్ను పట్టించుకొనే వారెవరూ లేరు."

"యెంత కలుసుకున్నా, యెన్ని మాట్లాడుకున్నా, ప్రేమకు అక్షర రూపమిస్తే ఆ అనుభూతి వేరుగా వుంటుంది—చిరకాలం చదువుకొంటూ తీయటి జ్ఞాపకాల్ని నిలుపుకోడానికి. ఆలోచించు."

"లేదు, మేం యెప్పుడూ వ్రాసుకోలేదు. ఆమెకది నచ్చదు. నేను కలం పడితే ఒక వాక్యం కూడా సరిగా వ్రాయలేను. అయాం బాడ్లీ యెడ్యుకేటెడ్."

"ఆమె యేం మాట్లాడుతుంది?"

"తెలుగు, ఓ మోస్తరుగా ఇంగ్లీషు."

"బట్సు యెక్కడా లేవు బ్రదర్" జాన్ అన్నాడు వెనుకనుంచే.

"వెల్, లెట్స్ గో!" లాల్ అన్నాడు లేచినిలబడి.

"యెక్కడికి?" వివేక్ అన్నాడు గాభరాగా.

"మీ తోటకి."

జాస్ డ్రైవ్ చేయసాగాడు.

"వివేక్ నువ్వు ఏదీ దాచకుండా అంతా నిజం చెప్పాలి. అది నీకే మంచిది. ఇది చాలా సీరియస్ వ్యవహారం" అడిగాడు లాల్.

"మీతో అబద్ధాలు చెప్పను. అంతా నిజమే చెప్తాను,"

"మీరు రోజూ ఎక్కడ కలుసుకొంటారు?"

"ఒకచోట అని లేదు. సినిమాలకి, పార్కులకీ, హోటళ్ళకీ...."

"ఆమె కన్నేళ్ళు?"

"నాకంటే మూడేళ్ళు తక్కువ."

"ఆమెకు షూటింగ్ నేర్వాలని ఎందుకు బుద్ధి పుట్టింది?"

"ఆమే పట్టుబట్టింది నేర్పమని. పదిరోజుల క్రిందట ఏదో మాటల సందర్భంలో నాన్న దగ్గర రివాల్వర్ ఉందన్న సంగతి చెప్పాను. అప్పటినుంచీ తనకూ నేర్పమని ఒకటే—"

"నీకు షూటింగ్ అంత బాగా వచ్చా?"

"ఆర్నెల్లు కష్టపడి టార్గెట్ షూటింగ్ నేర్చుకున్నాను. వందగజాల దూరంలో దేన్నైనా గురితప్పకుండా కాల్చగలను—ఒకే షాట్‌తో. ఇప్పుడు మూవింగ్ టార్గెట్ కూడా ప్రయత్నించాలనుకొంటున్నాను."

"మార్గరెట్ ఎన్ని షాట్స్ పేల్చింది నిన్న?"

"మూడు....ఒకసారి చెప్పాను కదా? నేను ఆరు కాల్చాను. మిగతా మూడు రివాల్వర్‌లోనే ఉన్నాయి

సార్, ఆమె చాలా ధైర్యస్థురాలు. ఆమె తలమీద ఆపిల్స్వుంచి షూట్ చేస్తే ఎంతమాత్రం భయపడలేదు!"

"ఏమిటీ! ఆమె తలమీద ఆపిల్స్ వుంచి—"

జాన్ అప్రయత్నంగా వేగం తగ్గించి వెనక్కి తిరిగి చూశాడు.

వివేక్ పెద్దగా నవ్వాడు. "అవును సార్, అలా చేయాలని నాకు చాలా కాలంగా వుండేది. కౌబాయ్ సినిమాల్లో చూసేవాడ్ని. ఎగరగలిగిన హీరో షూటింగ్ నేర్చుకునేప్పుడు తప్పకుండా అలాంటి సీను పెడ్తారు-హీరోయిన్తోనో హాస్యగాడితోనో—తలమీద ఆపిల్ వుంచి దాన్ని ఎగర గొట్టడం."

"నువ్వలా చేశావా?"

"చేశాను సార్! రెండు ఆపిల్స్ చెక్కలు చేశాను. ఆమె ఏమాత్రం బెదరలేదు. ఉత్సాహంగా నవ్వుతూ నిలబడింది."

"నువ్వు చాలా తెగించావు."

"నా గురి మీద బాగా నమ్మకముంది."

"ఆల్ రైట్, ఆ తరువాత ఏం జరిగింది? మీరేం చేశారు?"

"చీకటి పడుతోంటే షూటింగ్ విరమించుకున్నాం. అక్కడే గడ్డిలో కూర్చుని మాట్లాడుకో సాగాం."

"ఏం మాట్లాడుకున్నారు? ఏ విషయాలు?"

జాన్ వేగం పెంచి డ్రైవ్ చేయసాగాడు.

"ఆమె మాట్లాడలేదు. నేను చెప్తున్నాను, రివాల్వర్ గురించీ, దాన్నుపయోగించే విధానం గురించీ. చీకట్లో ఆమె భావాలు నాకు కన్పించలేదు.... నా మాటలు వింటోందో, ఇంకేదైనా ఆలోచిస్తోందో తెలియదు. రివా

ల్వర్ నా వొడిలోనే వుంది....ఆమె నా ఎదురుగా వుంది. అలా పది నిమిషాలు గడిపాం.

"అకస్మాత్తుగా ఆమె చెయ్యి జాపి రివాల్వర్ అందుకుంది! 'మార్గరెట్, ఈ చీకట్లోవద్దు' అన్నాను. 'ఇక్కడేమీ చెయ్యను. ఈ రివాల్వర్ నాక్కావాలి!' అందామె. నేను గాభరాపడి లాక్కోబోయాను. ఆమె చెయ్యి వెనక్కి తీసుకుంది. నేను ముందుకు జరిగి అందుకోబోయాను. అంతకుముందే మెరుపు వేగంతో రివాల్వర్‌తో నా తలమీద కొట్టింది! అంతేసార్, అదే దెబ్బ! ఆ దెబ్బకి కళ్ళు తిరిగాయి. వెనక్కి పడిపోయాను. నాకు స్పృహ తప్పింది...."

"ఎంత సేపు? ఇది ఎన్నిగంటలకి జరిగింది?"

"ఏడుంపావు కనుకుంటాను. గంటసేపు నాకు స్పృహ లేదు. లేచిచూస్తే ఆమె లేదు! రివాల్వర్ కోసం వెతికాను. అదిలేదు! వెంటనే స్కూటరెక్కి ఆమె ఇంటికెళ్ళాను. తాళం ఉంది. ఇంటికి తిరిగి వచ్చేసి మళ్ళీ వెళ్ళాను. అప్పుడూ రాలేదు. ఆమె కోసం ఎక్కడ వెతకాలో అర్థంగాలేదు. మళ్ళీ వెళ్ళినా లేదు. ఉదయం లేచి తోటకెళ్ళి చూశాను, రివాల్వర్ కోసం.... లేదు. అప్పుడు మళ్ళీ ఆమె ఇంటికెళ్ళాను. అలాగే తాళంవేసి వుంది. ఇక నా ఆందోళన అణచుకోలేకపోయాను. ఎన్నో భయాలు.... రకరకాల అనుమానాలు....ఓహ్, భరించలేకపోయాను- మమ్మీతో చెప్పేశాను."

"అంత పిరికివాడివా?"

"అది పిరికితనమా? ఆఫ్టరాల్, తల్లులున్నదెందుకు? గోడు వెళ్ళబోసుకొని వొడిలో రిలాక్స్ అవడానికి కాదా?"

"నీలాంటి పసివాడికి."

"సరే, ఇప్పుడు తోటకెందుకు? ఆమె ఊరొదిలి పారిపోతే—"

"ఎక్కడికి? ఆమెదీవూరే నన్నావు. ఆమె కెవరూ లేరు. ఉన్నపళంగా కట్టు బట్టలతో, డబ్బు చూసుకోకుండా ఏవూరెళ్తుంది? ఆమె కిక్కడే ఎవరో శత్రువు ఉండాలి...."

"అయితే, ఎవర్నో చంపాలనుకొంటే మరి—"

"మరి?"

"ఆ పని అప్పుడే—రాత్రే చేసి ఉండాలి. కానీ—"

"కానీ?"

"హత్య గురించి వార్త లెక్కడా లేవెందుకని?"

లాల్ అన్నాడు, "ఆమె చంపాలనుకున్న వ్యక్తి ఎదురు దాడి జరిపి ఆమెని—వెల్, అదొక లాజిక్—ఇక మీ తోట వచ్చేసింది, వివేక్. మన మిప్పుడు తోటంతా గాలిస్తాం, ఆమె ఎక్కడైనా కనిపిస్తాం దేమో....ఆమె నిన్ను కొట్టి పారిపోయినప్పుడు ఆమె గేటువైపు కదలదు—నువ్వా మార్గంలో వెంటాడు తావన్న భయంతో. అందువల్ల ఏ ప్రక్కనుంచైనా మీ తోట దాటేసి—చుట్టూ ఏముంది? గోడనా? కంచెనా?"

"కంచె. స్థంబాలు పాతి తీగెలు బిగించారు."

"వెల్, ఆ కంగారులో చీకట్లో కంచె దాటుతున్నపుడు అందులో దుస్తులు చిక్కుకుంటే క్రిందపడి ప్రమాదం జరుగవచ్చు. రివాల్వర్ పేలవచ్చు. దాన్ని నడుములో దోపుకుని వుంటే ప్రమాదం చాలావరకు ఉండదు గానీ, చేతిలోవుంటే చెప్పలేం."

"ఓహో, అలాజరగదు! ఆమెకలా కాదు!"

"అది మాకో లాజిక్."

జాన్ గేటుముందు కారాపేశాడు.

లోపలినుంచి ఓ ముప్ఫై ఏళ్ళ మనిషి పరుగెత్తివచ్చాడు.

"రాజూ! గేటుతీయ్!" వివేక్ అర్చాడు.

గేటు తెరవడంతో జాన్ కారులోనికి పోనిచ్చి ఆపాడు.

అంతా దిగారు.

లోపల ఇరవైగజాల దూరంలో పూర్తి కొయ్యతో నిర్మించిన చిన్న కేబిన్ ఉంది. దాని వెనుక పరుచుకున్న విశాలమైన అయిదెకరాల స్థలంలో ద్రాక్షతోట ఉంది. రాతిస్తంభాలపైన పందిళ్ళు కట్టి వాటిమీద తీగెలు ప్రాకించబడ్డాయి. గుత్తులు బరువుగా వ్రేలాడుతున్నాయి. తోటంతా నిశ్శబ్దంగా వుంది, అప్పుడప్పుడు పక్షులకూతలు తప్పితే.

"మీరెక్కడ కూర్చున్నారు?" లాల్ అడిగాడు.

"రండి, చూపిస్తాను."

జాన్ చటుక్కున అన్నాడు. "తోటకు నీరెలా అందుతుంది?"

వివేక్ అర్థంగాక చూశాడు. "మధ్యలో బావి వుంది- ఇంజన్‌తో తోడుతాం"

"చూద్దాం పద!"

ముగ్గురూ కదిలి వెళ్ళారు. పనివాడు వెనుక వచ్చాడు.

కేబిన్ వెనుక, తోట మధ్యనుంచి సూటిగా దారి వుంది ఆ చివరవరకూ. దారి మధ్యలో పెద్ద బావి విశాలంగా పర్చుకొనుంది. దానిచుట్టూ గోడ నడుము యెత్తు కూడా లేదు. అందరూ అక్కడ ఆగారు.

"నిన్న మీరు కూర్చున్న చోటునుంచి గేటు దగ్గరికి

దారి ఇదేనా?" అడిగాడు జాన్.

"అవును, ఇదే. ఇదొక్కటే" వివేక్ అన్నాడు.

జాన్ బావిలోకి కుతూహలంగా చూస్తున్నాడు. నీళ్ళు చాలా లోతున పచ్చగా అగుపిస్తున్నాయి. నిలకడగా వున్నాయి.

బావిలోకి రెండు పంపులు చెరోవైపునుంచి వెళ్ళాయి. గోడ కిరువేపులా రెండు సిమెంటు కొళాయిలున్నాయి. వాటి ముందునుంచి ఇరువైపులా కాలువలున్నాయి. కొళాయిల్లో పడ్డాక నీళ్ళు ఆ కాలువలగుండా తోటకి పారుతాయి.

"తోటకి నీరెప్పుడు పెట్టారు?" అడిగాడు లాల్ కాలువల్ని చూస్తూ.

"ఇది పెట్టే సమయం కాదు, కోతల సమయం" రాజు అన్నాడు.

"ఈ నీరు ఇంకే అవసరానికి వాడతారు?"

"తాగడానికి పనికిరావు. స్నానం చేస్తుంటాను అప్పుడప్పుడు."

"నిన్న చేశావా?"

"లేదు."

"మరి ఈ కాలువలో నీరెందుకు నిలిచాయి, యెడమ కాలువలో?"

"అదే ఆలోచిస్తున్నాను. నిన్న తోడలేదు. మొన్న స్నానం చేశాను, కుడిగాబు దగ్గర. ఇప్పుడు యెడమ గాబులో నిండా నీరున్నాయి, తాజా నీరు. అర్థం గావడంలేదు" అని వివేక్ రాజుని పిలిచి అడిగాడు. అతనూ నీరు పెట్టలేదన్నాడు.

జాన్ తలెత్తి వివేక్‌ని చూశాడు. "ఇక్కడ బావి

వున్నట్లు ఆమెకు తెలుసా?"

"వెళ్ళేటప్పుడు చూపించాను, తెలుసు."

"అలాకాదు, మార్గంలో ఎక్కడో వుందని మాత్రమే ఆమెకు తెలుసు. అంతకుముందు ఆమె ఇక్కడికి రాలేదు. ఈ పరిసరాలతో పరిచయంలేదు. బావి ఇంకా ముందు వుందనుకుంటూనో, లేక ఆ కంగారులో అసలు దాని గురించి ఆలోచించకుండానో, అలా పరిగెడ్తూ చీకట్లో ఈ గోడను అతస్మాత్తుగా ఢీకొంటే...." జాన్ ఆగిపోయి క్షణం తర్వాత నెమ్మదిగా అన్నాడు. "అదుపు తప్పి ఆమె బావిలో పడ్డం ఖాయం!"

"ఓహ్, అలాకాదు! అలా జరగదు!" అర్చాడు వివేక్.

"ఆమె ఈ దారిలో ఉరకలేదు, జాన్. ఇతను వెంటాడుతాడని తెలుసు" అన్నాడు లాల్. "కమాన్, వివేక్, మీరు కూర్చున్న స్థలం చూద్దాం."

మళ్ళీ అంతా ముందుకి కదిలారు.

పది నిమిషాలు నడిచి యేపుగా పెరిగివున్న గడ్డి ప్రాంతానికి చేరుకున్నారు. ఆ గడ్డినేల 50 గజాల మేరకు వుంది. ఆపైన అవతల మళ్ళీ తోట వుంది. ఈ ప్రాంతాని కిరువేపులా అడ్డు ఏమీ లేదు—కొంతదూరంలో నూటిగా కంచె తీగలు కన్పిస్తున్నాయి.

కంచె కుడివైపు అవతల ఆస్బెస్టాస్ రేకులతో చిన్న చిన్న షెడ్స్ కన్పిస్తున్నాయి.

"అటువైపు కోళ్ళఫాం వుంది" అన్నాడు వివేక్.

ఎడమవైపు ఎత్తుగా పెరిగిన చెట్లు కన్పిస్తున్నాయి.

"ఇటువైపు ఖాళీస్థలం వుంది—ఎవరిదో."

"అయితే ఆమె ఇటువైపే ఉరికి వుండాలి" అన్నాడు లాల్.

ఈసారి నడక వేగం పెంచి వెళ్లారు. అయిదు నిమిషాల్లో కంచె చేరుకొన్నారు.

లాల్ ముళ్ళతీగెల్ని చూస్తూ నిలబడ్డాడు.

జాన్ కూడా పరీక్షగా చూస్తూ కుడివైపు సాగిపోయాడు.

"వెల్, ఈ తీగెల మధ్యనుంచి ఆమె దూరడం అసంభవం! ఉడుత కాదామె, చెంగున అవతల గెంతడానికి. తీగకూ, తీగకూ మధ్య ఆరంగుళాలు మాత్రమే ఖాళీ వుంది. కంచె ఎత్తు ఏడడుగులుంది. ఆల్ రైట్, ఆమె సర్కస్ ఆర్టిస్టులా ఈ తీగ లెక్కి (అదీ చీకట్లో!) అవతల దూకి వుంటే, కాళ్ళూ చేతులు తప్పకుండా గాయపడ్డాయి. చర్మం తెగి రక్తం స్రవిస్తుంది....రక్తం స్రవిస్తే తీగలకంటుకుంటుంది. దటీజ్ రైట్. మరి, ఈ తీగలకెక్కడా రక్తం మరకల్లేవేమిటి? వాటే వండర్. ఆమె ఎక్కి దూకలేదా, ఎగిరి దూకేసిందా అవతలకి? ఇంపాసిబుల్. అసలు చీర కట్టుకొని ఎక్కడమే కష్టం, మరి ఎలా దూకుతుంది చెప్మా....అందుకని దూకలేదు. అయితే—హాలో—హే, ఏమిటిది!" హఠాత్తుగా వెనక్కి దూకేసి అర్చాడు జాన్, "పార్ట్‌నర్ పసిగట్టేశాను! ఏమిటది? ఇక్కడిలా ఎందుకుంది...."

దూరంగా జాన్ అరుపులు విని లాల్ అటుకేసి చూశాడు.

జాన్ చెయ్యూపి పిలుస్తున్నాడు.

లాల్ వేగంగా వెళ్లాడు. వెనుక వివేక్, రాజు వెళ్ళారు.

అక్కడ నేల కొంతమేరకు గడ్డి మొలవకుండా,

ముక్కలు లేకుండా శుభ్రంగా వుంది. అక్కడ ఇటీవలే తవ్వబడిందని మెత్తగా ఉన్న, ఇంకా అణగని ఉపరితలం చెప్తోంది.

"లాల్! ఈ మట్టి అడుగునుంచి పెకిలించబడింది, చూడు!"

లాల్ చివాల్న రాజువైపు తిరిగాడు, "నువ్వెళ్ళి పార తీసుకురా! ఇక్కడ తవ్వాలి, త్వరగా!"

అతను పార తెచ్చి తవ్వుతోంటే ముగ్గురూ ఊపిరి బిగించి చూడసాగారు. వివేక్ చెమటలో పూర్తిగా తడిసిపోయాడు. తవ్వుతున్న వాడల్లా రాజు ఒక్క కేక పెట్టి పార దూరంగా విసిరేస్తూ పరుగు తీశాడు.

అసంపూర్తిగా తవ్వబడిన ఆ భాగంలోకి వివేక్ కూడా తొంగిచూసి కేకపెడ్తూ పరిగెత్తాడు.

డిటెక్టివ్‌లు ఒకర్నొకరు చూసుకున్నారు అయోమయంగా.

లోపల ఒక మానవరూపం రక్తసిక్తమై కన్పిస్తోంది... దాని నుదుటి మీద చిన్న రంధ్రముంది.

## 4

లాల్ వివేక్‌ని పట్టుకొని చెట్లనీడలోకి లాక్కెళ్ళాడు.

"ఇక్కడ ఫోన్ వుందా?"

"ఉంది, కేబిన్‌లో!"

"జాన్, నువ్వెళ్ళి ఫోన్ చేయ్ పోలీసులకి!"

జాన్ వేగంగా కదిలిపోయాడు.

"ఓహ్, లాల్! ఇది నిజంకాదు! నిజం కాదని చెప్పండి!" లాల్‌ని ఊపేస్తూ అర్చాడు వివేక్.

"ఏది నిజం కాదు? నువ్వు నిబ్బరంగా వుండు!"

"మార్గరెట్....!! నో, ఆమెకలా జరగడాని వీల్లేదు!

ఇదెలా జరిగింది, సార్? ఆమెకలా ఎవరు చేశారు?"

"నువ్వు కాదా?"

"నేనా? మీరనేది నన్నా సార్?"

"నిన్నే, నువ్వు కాదా?"

అతను తటాలున వెనక్కి చూశాడు. "ఓహ్, నన్నెలా అనుమానిస్తున్నారు! నేనామెని—"

"నువ్వామె తలమీద ఆపిల్సు వుంచి షూట్ చేశానన్నావు. ఆపిల్సునిగాక తల్లో షూట్ చేసి వుంటే?"

"అలా జరగలేదు! నే నాపిల్సునే షూట్ చేశాను!"

"లుక్, యూ పూర్ ఎలయర్. ఆమె నుదుట్లో రంధ్రముంది—బుల్లెట్ రంధ్రం."

వివేక్ కళ్ళు పెద్దవి చేశాడు; అయోమయంగా చూశాడు.

"లేదు, నేను ఆపిల్సునే ముక్కలు చేశాను! రెండు ఆపిల్సుని!"

"పొరపాటున నువ్వామెని చంపేశావు, యూ ఫూల్! దాన్ని కప్పిపుచ్చడానికి ఈ కథ. ఈ అబద్ధాలు. నువ్విక్కడ తెలివితప్పలేదు. ఆమెని చంపి పూడ్చిపెట్టావు. రివాల్వర్ కూడా ఆమెతోపాటే పూడ్చి, పారిపోయిందని బుకాయిస్తున్నావు—"

"లేదు, సార్! నేనలా చేయలేదు! ఆమెని చంపలేదు! మీరెలా నమ్మతారు? నేను గురితప్పకుండా ఆపిల్సునే షూట్ చేశాను!"

"ఎన్ని ఆపిల్సు తెచ్చావు?"

"నాలుగు. రెండు తిన్నాం."

"షూట్ చేసిన రెండు ఆపిల్సు ఏమయ్యాయి?"

"ఆ ముక్కలు అక్కడే పడివుంటాయి—"

"చూద్దాం పద!"

లాల్ ముందుకు దారితీయడంతో వివేక్ వెనుక నడిచాడు. ఇద్దరూ వేగంగా నిన్న వివేక్ షూటింగ్ జరిపిన స్థలానికి చేరుకున్నారు. అక్కడ వివేక్ ఆతృతగా గడ్డిలో వంగి వెతకసాగాడు. కంగారుగా, ఆందోళనగా రెండు నిమిషాలు గాలించి, ఒకచోట ఆపిలుపండు తీసి దాన్ని ఆశ్చర్యంగా చూశాడు. లాల్ చటుక్కున లాక్కున్నాడు.

"వెల్, నువ్వు దీన్ని షూట్ చేశానంటావు."

"లేదు!"అరిచాడు వివేక్. "దీన్ని కాదు, నేను షూట్ చేసిన రెండు పళ్ళూ ముక్కలయ్యాయి!"

"మరి ఇదెక్కడిది?"

వివేక్ గొంతు పెగల్లేదు. మళ్ళీ వంగి వెతకసాగాడు గాభరాగా. కొన్ని క్షణాల్లో రెండు ఆపిలుముక్కలు పట్టుకొని పరుగెత్తి వచ్చాడు.

"చూడండి! నేను షూట్ చేసిన ముక్కలు ఇవి!"

"కానీ రెండు ఆపిల్సుని షూట్ చేశానన్నావు."

"అదే అర్థంగావడంలేదు! మరో ఆపిలు ముక్కలు కన్పించడంలేదు!"

"కన్పించవు. ఎందుకంటే, దాన్ని నువ్వు ముక్కలు చేయలేదు గనుక. ఆ మరో ఆపిలు ఇది. దీన్ని షూట్ చేయబోయావు, కానీ బుల్లెట్ గురితప్పి ఆమె తల్లో దూరింది——"

"కాదు! కాదు సార్, కాదు!"

"అయితే ఈ ఆపిలు ముక్కలెందుకాలేదు, ఈడియట్!"

"నేనా ఆపిలుని షూట్ చేయలేదు! ఆ ఆపిలు వేరే

వుండాలి. కానీ ముక్క—లెక్క—డా కన్పించడంలేదు. మాయమయ్యాయేమో! పక్షులు-ఉడతలు తిన్నాయేయో. సార్! షూటింగ్ ముగించాక ఒక ఆపిలు ఆమెకిచ్చి తినమన్నాను. నేనొకటి తిన్నాను. ఆ కానీ ఆమె తిన్నట్లు గుర్తులేదు. చీకట్లో ఇక్కడ వదిలేసిందేమో—అదే ఈ ఆపిలు—"

లాల్ అతన్ని చూస్తూ ఆలోచనల్లో పడ్డాడు.

"వివేక్, నువ్వెంత దూరంనుంచి షూట్ చేశావ్?"

"పది—పదిహేను అడుగులుండవచ్చు."

"నిశ్చయంగా చెప్పు, చాలా ముఖ్యం."

"అంతే, పదిహేను అడుగులు!"

"అప్పుడు టార్గెట్ ని — ఆపిల్ని స్పష్టంగా చూశావా?"

"స్పష్టంగా చూశాను."

"దృష్టిలోపం లేదుగా?"

"లేదు! విటమిన్ ఎ బాగా తీసుకుంటాను!"

"అప్పుడు కళ్ళకేమీ అడ్డు లేదుగా?"

"ఏం వుంటుంది, సార్?"

"సూర్యకిరణాలు నీ కళ్ళమీద పడ్డం లేదుగా?"

"లేదు, సూర్యుడు నా వెనుక ఉన్నాడు."

"అప్పుడు?"

"సూర్యకిరణాలు ఆమె మీద పడుతున్నాయి. పచ్చటి లేతకిరణాలు. సూర్యాస్తమయ సమయం మీరు చూసేవుంటారు. చాలా మనోహరంగా వుంటుంది."

"ప్రొసీడ్!" అర్చాడు లాల్ అసహనంగా.

"ఆ కిరణాలు పడి ఆమె మెరిసిపోతోంది. బంగారు రంగు కిరణాలు.—"

"అప్పుడు నీ కళ్లు చెదిరాయి. మిరమిట్లు గొలిపాయి."

"లేదు, లేదు నా కళ్ళు చెదరలేదు. టార్గెట్‌ని రెప్ప వేయకుండా చూశాను. తలమీద ఆపిలుతో ఆమె నవ్వుతూ నిలబడింది. బెదరలేదు, కదల్లేదు. నేను గురి జాగ్రత్తగా ఫిక్స్ చేశాను. ప్రాణంతో చెలగాటం. బాగా నమ్మకం కల్గిన మీదటే ట్రిగ్గర్ లాగాను. అంతే ఆపిలు ముక్కలై ఎగిరిపోయింది! మరోసారి అలాగే షూట్ చేశాను—"

"సరే, నేనిప్పుడు నెత్తిమీద ఈ ఆపిలునుంచుకొని నిల్చుంటాను. షూట్ చేస్తావా?"

"ఇప్పుడా? ఈ పరిస్థితిలోనా! లేదు సార్, చేయలేను. మిమ్మల్ని కూడా—"

లాల్ గబుక్కున అతన్ని బలంగా పట్టేసుకున్నాడు, "నువ్వేమన్నావ్? వివేక్! ఏమిటి నువ్వన్నది? కూడా నా- నన్ను కూడానా!"

వివేక్ ముఖంలో నెత్తురు చుక్కలేదు! బోనులోపడ్డ ఎలుకలా చూశాడు. ఉన్నట్లుండి చేతుల్లో ముఖం దాచుకొని ఏడ్వనారంభించాడు.

లాల్ అతన్ని వదిలేసి అలసటగా సిగరెట్ వెల్గించాడు.

"స్టుపిడ్! యూ కేర్ లెస్ లిటిల్ పంక్" తిట్టాడతను.

"ఓహ్, సార్! నేను జరిగింది పూర్తిగా చెప్పలేదు!"

"నీ కర్మ. నా దగ్గర ఏదీ దాచవద్దని హెచ్చరించాను."

"ఆమె రివాల్వర్ లాక్కున్నప్పుడు పెనుగులాటలో అది పేలింది!"

"అలా చెప్పు. అప్పుడేమైంది?"

"ఆమె కేకపెట్టింది. నేను భయపడి చెయ్యి వది లేశాను. అప్పుడామె నా తలమీద బలంగా కొట్టింది రివాల్వర్‌తో! పడిపోయాను."

"వెరీగుడ్, ఇంకా చెప్పు."

"అంతే సార్, ఆ తర్వాతనుంచి మీకు చెప్పిందంతా నిజం! ఆమె చచ్చిపోలేదు. అక్కడసలు లేదు! రివాల్వర్‌తో పారిపోయింది. అప్పుడు పేలిన షాట్ వల్ల ఆమెకేమీ కాలేదనే నమ్ముతూ వచ్చాను. కానీ-ఇప్పుడు-ఆమె నా స్థితిలో చూస్తే అదే జరిగిందనిపించింది!"

"కానీ చంపలేదంటావు."

వివేక్ అయోమయంగా చూశాడు.

"వెరీ బాడ్. నువ్విప్పుడు తప్పించుకోలేవు" అన్నాడు లాల్.

"ఇప్పుడేమవుతుంది? నన్నేం చేస్తారు?"

"అరెస్టు చేస్తారు. నువ్వామెని చంపినట్లు నీ మాటలతోనే ఋజువు చేస్తారు. నువ్వామెని చంపడమేగాక, శవాన్ని పూడ్చావు. మమ్మల్ని తప్పుదారి పట్టించడానికి ప్రయత్నించావు."

"ఓ మై గాడ్! నన్నెవరు నమ్ముతారు? ఆమెని పూడ్చింది నేను కాదు— నేను కాదు— నేను—"

దూరంగా పోలీసుకారు దూసుకొస్తూ కన్పించడంతో వివేక్ అరుపులా పేశాడు.

# 5

ఇన్స్‌పెక్టర్ బాలకృష్ణన్ ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ ఆఫీసులో బ్రీఫ్ కేసుతో అలసటగా ప్రవేశించాడు.

"ఫ్రెండ్స్, వివేక్‌ని ఇహ రక్షించలేరు!" అన్నాడతను.

"కూర్చోండి, చాలా రాత్రయింది. మీరు చాలా శ్రమపడుతున్నారు" అన్నాడు లాల్.

కృష్ణన్ కూర్చుని నవ్వాడు. "ఓ.కే; ఇక వినండి. వివేక్ హంతకుడు. మార్గరెట్ ని చంపాడు. డాక్టర్ ఇంకా రిపోర్టు తయారుచేయలేదు. కానీ రఫ్ అయిడియా కొంత ఇచ్చాడు. చావు నిన్న రాత్రి 9—10 మధ్య సంభవించిందట...."

"9—10 మధ్యా?" కలవరపడ్డాడు జాన్.

"అవును. సందేహంలేదు. కచ్చితంగా చెప్పాలంటే 9 : 30కి. ఇది వివేక్ స్టేట్ మెంట్ తో విభేదించవచ్చు. అతని మాటలు అబద్ధం. అతని కనుకూలంగా కొన్ని సాక్షాలున్నా, వాటికంటే వ్యతిరేకంగా వున్న సాక్ష్యాలు సంఖ్యలోను, బలంలోనూ మొగ్గు చూపిస్తున్నాయి....

"నెంబర్ వన్: చివరి రివాల్వర్ షాట్స్. ఇవి తొమ్మిదిన్నరకి వెనువెంట నే మూడుసార్లు తోటప్రక్కన కొ ళ్ళ ఫా ం వాళ్ళకి వినిపించాయి. అంతకుముందు, సాయంత్రం కూడా చాలా వినిపించాయి. అయితే అవి చీకటిపడే ముందు ఆగిపోయాయి. బాగా చీకటిపడ్డాక తొమ్మిదిన్నరకి వినిపించాయంటున్నారు. ఇక వివేక్ మార్గరెట్ తో పెనుగులాట రెప్పపాటు కాలంలో ముగిసిందంటున్నాడు. కానీ ఆటోప్సీలో వాళ్ళిద్దరి మధ్య చాలా ఘర్షణ జరిగిందని తెలుస్తోంది....

"మిస్టర్ లాల్, పెనుగులాట రివాల్వర్ కోసం జరగలేదనీ, అక్కడ ఎవరూలేని అవకాశంతో ఒంటరిగా వున్న ఆమెమీద వివేక్ దురుద్దేశ పూర్వకంగా దాడి జరిపాడని అర్థమవుతోంది. ఆమె సహకరించకపోవడంతో కోపంలో ఆవేశంలో కాల్చేశాడు,

"నెంబర్ టూ: అతడు 8 : 30కి స్పృహలోకొచ్చానంటున్నాడు. కానీ పెనుగులాట తొమ్మిదిన్నరకి జరిగింది. కాబట్టి అతడు స్పృహతప్పడమన్నది బనాయింపు. అతను చెప్పిన ప్రకారము 7-7.15 మధ్య ఎటువంటి షాట్స్ కోళ్ళఫాం వాళ్ళకి వినిపించలేదు. ఇంకా అతను చెప్తున్న దాన్నిబట్టి తొమ్మిది గంటలకి మార్గరెట్ ఇంటికెళ్ళాడు. అక్కడామె లేకపోతే తమ ఇంటికి తిరిగివచ్చాడు పది గంటలకి. మళ్ళీ పదకొండు గంటలకు ఆమె కోసం వెళ్ళి ఎప్పుడొచ్చాడో తెలియదు. పన్నెండు దాటాక మరో సారి వెళ్ళివచ్చాడు. అయితే 10 గంటలకి ఇంటికివచ్చిన విషయం తల్లి ధృవీకరిస్తోంది.

"దీన్ని మనమిలా అర్థంజేసుకొంటే బాగుంటుంది. తొమ్మిదిన్నరకి ఆమెని చంపాక అతను కంగారుపడ్డాడు. అలా చేస్తాడని వూహించి వుండడు. క్షణికోద్రేకంలో చేశాడు. వెంటనే ఆమె బ్యాగులో తాళాలు తీసుకొని తమ ఇంటికెళ్ళిపోయాడు. అప్పుడు పదవుతోంది. అక్కడ తల్లి దృష్టిలోపడి, పదకొండు గంటలకి మార్గరెట్ ఇంటికెళ్ళి అక్కడ తన ఉత్తరాలూ, తనకు చెందిన ఇతర వస్తువులూ తొలగించాడు. అప్పుడు తిరిగి తోటకు వెళ్ళాడు. అక్కడ చకచకా గొయ్యితీసి, ఆమెని పూడ్చిపెట్టే కార్యక్రమం వేగంగా పూర్తిచేశాడు. తాళంచెవులు బ్యాగులోవేసి, బ్యాగును శవంతోబాటు పాతిపెట్టాడు. అప్పుడు ఏ అర్థరాత్రి దాటాకనో ఇంటికెళ్ళి నిద్రపోయాడు.

"నెంబర్ త్రీ: షూటింగ్ ముగించి తామిద్దరు కూర్చున్నప్పుడు, ఆమెకో ఆపిలు ఇచ్చి తనొకటి తిన్నానంటున్నాడు. అయితే ఆమె తినివుండదని చెప్తున్నాడు

ఇప్పుడు. డాక్టర్ తిందని అంటున్నాడు. తోటలో మనకో ఆపిలు, మరొక ఆపిలు ముక్కలు లభించాయి. అతడు రెండు ఆపిల్సుని షూట్ చేసి వుంటే రెండింటి ముక్కలుండాలి. కాని ఒక్కదానివే వున్నాయి. మరొకటి పూర్తిపండు లభించింది.

"దీన్నిబట్టి వివేక్ అసలు ఆమె తలమీద ఆపిలువుంచి షూట్ చేయలేదనీ, ఆమె ఒప్పుకోలేదనీ (అలాటి మతిలేని పనికి ఆమె ఒప్పుకోదు గాక ఒప్పుకోదు!), ఆమెని చంపాక తినగా మిగిలిన రెండు ఆపిల్సుని షూట్ చేశాడనీ, ఆ ప్రయత్నంలో రెండో ఆపిలు గురితప్పి గడ్డిలో ఎక్కడో పడిపోయిందని భావించవచ్చు.

డిటెక్టివ్‌లు తలూపారు.

"ఇక నెంబర్ ఫోర్: రివాల్వర్. దాన్ని అయిపు లేకుండా చేశాడు. ఎక్కడో పారేసి మార్గరెట్ దాంతో పారిపోయిందని బుకాయిస్తున్నాడు. నిజం చెప్పించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. శవంలో దొరికిన బుల్లెట్ .38 కోల్టుకు చెందిందనంటున్నాడు ఎక్స్‌పర్టు మాలిక్. వివేక్ తండ్రి రివాల్వర్ కూడా అదే తయారీ. ఇక ఆలోచించండి. ఇంతకంటే నేను చెప్పవల్సిందేమీ లేదు."

"కానీ కృష్ణన్, పెనుగులాట జరిగిన సమయం గురించి అతను అబద్ధం ఎందుకు చెప్పాలి? 9 : 30 కే జరిగిందని చెప్పే అపాయమేమిటి?" లాల్ అన్నాడు.

"తొమ్మిదిన్నరకి అతనికి ఎలిబీ లేదు. అందుకే ఆ సమయాన్ని వెనక్కి తగ్గించి, ఏ సమయంలో ఎక్కడున్నాడో చెప్తున్నాడు. దీనితో తోటలో తను తొమ్మిదిన్నరకి లేడనే భావం మనకు స్ఫురిస్తుందనుకున్నాడు. కానీ, ఆ సమయంలో ప్రేలిన షాట్స్‌కు సాక్ష్యాలున్నా

రన్న సంగతి పాపం అతనికి స్ఫురించలేదు."

"హత్య నిర్ణీతంగా ఏ స్థలంలో జరిగిందని నిర్ధారించారు?"

"ఎక్కడ జరగాలి? ఘర్షణ జరిగినచోట. ఘర్షణ ఎక్కడ జరిగింది? ఆమెకు షూటింగ్ నేర్పినచోట. అతను చూపించాడు, మీరు చూశారు. అక్కడే ఆపిల్సు కూడా లభించాయి."

"కాబట్టి అదే హత్యాస్థల మనుకుంటున్నారు."

"ఎందుకనుకోకూడదు? కాదని ఎలా అంటారు?"

"ఘర్షణ జరిగిన చిహ్నాలక్కడ లేవుగనుక! గడ్డి ఎక్కడా నలగలేదు గనుక! రక్తం అక్కడెక్కడా లేదు గనుక!"

"అరెరె, అదేమిటి? ఆగండి. అక్కడ రక్తమెందుకుండాలి? ఆమె ఇంట్లో వేలిముద్రలు పడకుండా జాగ్రత్త పడ్డవాడు రక్తం గురించి అశ్రద్ధగా వుంటాడా? రక్తం తొలగించాడు. ఇక గడ్డి నలగడమన్నది ఘర్షణ జరిగినప్పుడా లేక షూటింగ్ నేర్పినప్పుడా అని చెప్పడం కష్టం. కానీ అక్కడ చాలా మేరకు గడ్డి నలిగింది. మీరు చూశారు——"

"ఓ.కే. కానీ రక్తం ఎలా తొలగించాడు? నేలలో ఇంకిన రక్తం ఆనవాలు లేకుండా తొలగించడం జరగదు. అక్కడ తవ్వాలి. మట్టి తీసెయ్యాలి. అప్పుడు కొంత గడ్డి కూడా పీకెయ్యాలి. అలా చేస్తే ఇట్టే తెలిసిపోతుంది. అక్కడ తవ్వినట్టు ఎక్కడా లేదు."

"అయితే రక్తం ఏమైనట్టు? చిందలేదా?"

"అక్కడ రక్తం లేదంటే అర్థం హత్య అక్కడ జరగలేదని."

"మరెక్కడ జరిగింది? పాట్స్ అక్కడే విన్పిం చాయి."

"బహిరంగ ప్రదేశాల్లో చెవులు మోసపోతుంటాయి. ప్రతిధ్వనులనుంచి అసలు ధ్వని పుట్టిన కేంద్రాన్ని గుర్తించడం కిష్టంగా వుంటుంది. దాన్నలా వదిలేయండి. అతని శారీరక స్థితి మాటేమిటి? శవం పూడ్చడానికి గొయ్యి తీసివుంటే చేతుల్లో మట్టి వాసన వుంటుంది, స్వల్పంగా గాయపడవచ్చు చీకట్లో; గోళ్ళమధ్య మట్టి రేణువులు ఇరుక్కుంటాయి; బట్టలు మాస్తాయి, జోళ్ళు ఇంకా బాగా సాక్ష్యం పలుకుతాయి. డాక్టర్ ఏమ న్నాడు?"

"అతన్ని పరీక్షించాడు గానీ అలాంటి చిహ్నాలు లేవన్నాడు. నవ్వకండి, ఆ పని అతడు చేయించి వుండ వచ్చు."

"చేయించాడా?"

"నమ్మకంగా. పనివాడు రాజుతో చేయించాడు. ఇద్దరూ కుమ్మక్కయ్యారు. తోడు దొంగలు. ఆమెతో గడపడానికి వాడికి డబ్బిచ్చి సినిమాకు పంపినవాడు, శవం పూడ్చడానికీ ఇంకో ఆశ ఎందుకు పెట్టకూడదు?"

"అది రుజువైందా?"

"లేదు. ఈ పనివాళ్ళ దేహం, దుస్తులు పనిచేసినా, ఏం చేసినా ఒకేలా వుంటాయి. సందర్భాన్నిబట్టి వేరుగా గుర్తించడం కష్టం. తవ్వడాని కుపయోగించిన సామగ్రిని చూశాం. పారమీద మాత్రం రాజు వేలిముద్రలున్నాయి. మీరు శవాన్ని కనుక్కున్నప్పుడు దానితో తవ్వించారు. మిగతా పనిముట్లు శుభ్రంగా తుడిచి వున్నాయి. కడుగ లేదు. కానీ బావి దగ్గర రాత్రి నీళ్ళు తోడిన సూచన

లున్నాయి. తప్పినవాడు వాళ్ళు తోముకున్నాడు....

"ఈ పనివాడు రాజు సాయంత్రం ఆరుగంటలకి సినిమాకి బయలుదేరాడు. తిరిగి 12 దాటాక వచ్చానంటున్నాడు. ఆట వదిలాక సారాకొట్లో తాగుతూ కూర్చున్నాడట అంతసేపూ. అక్కడ యజమానితో పాటు కొందరు సాక్ష్యం ఇస్తున్నారు. వాళ్ళ సాక్ష్యం ఎంతవరకు నమ్మాలో మీరే ఆలోచించండి. నేను మాత్రం నమ్మను. అంతా దొంగలు. డబ్బుకి అమ్ముడుపోయే దొంగలు. వివేక్ డబ్బు వెదజల్లి –"

జాన్ అడ్డు తగిలాడు. "ఓ. కే! ఓ. కే! ఆరోపణలు వద్దు. ఇందాక శారీరక స్థితి అంటే నాకో పాయింట్ తట్టింది, ఇన్స్పెక్టర్."

"ఏమిటది?"

"వివేక్ తలమీద బొప్పికట్టిందని డాక్టర్ చెప్పాడు, అవునా?"

కృష్ణన్ సంకోచించాడు. "అవును."

"అది మార్గరెట్ రివాల్వర్‌తో కొట్టడంవల్ల అయింది కదూ?"

"అని వివేక్ చెప్తున్నాడు?"

"డాక్టర్ ఆ బొప్పి స్థితిని పరీక్షించి రాత్రి ఏర్పడిందని చెప్పాడు కదూ?"

"అవును. రాత్రి ఏర్పడిందట...."

"బొప్పి పరిమాణాన్నిబట్టి—ఆ వాపునిబట్టి ఇంకేం చెప్పాడు?"

కృష్ణన్ మాట్లాడలేదు.

"చెప్పండి, కృష్ణన్" జాన్ అన్నాడు.

కృష్ణన్ కిటికీ బైట చూశాడు.

"చెప్పండి, ఇన్స్పెక్టర్. బెట్టు చెయ్యకండి, నాకు కోపం వస్తుంది."

"స్పృహ తప్పుతుందని — తప్పిందని అన్నాడు" చెప్పాడు కృష్ణన్ నెమ్మదిగా.

జాన్ కళ్ళు మెరిశాయి. "రైట్ — వో! అదేనా పాయింట్."

లాల్ చటుక్కున కృష్ణన్ చెయ్యి అందుకున్నాడు. "ఇన్స్పెక్టర్ మీరు తొందరపడకండి. లాజిక్ మీద ఆధారపడి నిర్ణయాలు చెయ్యడం ఇటువంటి పరిస్థితుల్లో మంచిదికాదు. వాస్తవం ఆధారం కావాలి. వాస్తవం ఇంకా మనకు తెలియదు. తెలుసుకునేందు కాయాశక్తులా ప్రయత్నిద్దాం. అంతవరకూ నిర్ణయాన్ని వాయిదావేద్దాం. మార్గరెట్ వివరాలు తెలుసుకునేందుకు మీరేం ప్రయత్నాలు చేస్తున్నారు?"

"ప్రెస్ వాళ్ళకి ప్రకటనిలిచ్చాం."

"దట్స్ గుడ్. మీరిక ఈ రాత్రి కేసు మర్చిపోండి!" అన్నాడు లాల్.

# 6

మర్నాడు ఉదయం పదిన్నరకి ఏజెన్సీ ఆఫీసులో ఒక ఆగంతకుడు ప్రవేశించి, "ఆదాబ్ డిటెక్టివ్ సాబ్" అన్నాడు వినయంగా.

డిటెక్టివ్‌లు తలెత్తి చూశారు. అతనికి ముప్ఫై ఏళ్లుంటాయి. కాకీ డ్రెస్‌లో వున్నాడు.

"ఏమిటి?" లాల్ అడిగాడు.

"నా పేరు రెహమాన్ సాబ్, ఆటో డ్రైవర్ని."

"అయితే?"

"నేనామె ఫోటో చూశాను సాబ్."

"ఎవరి ఫోటో?"

"మార్గరెట్ ఆమె పేరు సాబ్"

డిటెక్టివ్‌లు ఉలికిపడి చూసుకున్నారు.

"ఆమె గురించి నీకేం తెలుసు?" లాల్ అన్నాడు.

"నిన్న ఆమె నా ఆటో ఎక్కింది సాబ్."

"ఇలా వచ్చి కూర్చో, వివరంగా చెప్పు."

అతను వచ్చి కూర్చున్నాడు. "ఇప్పటిదాకా చాయ్ తాగుతూ పేపరు చూసినా సాబ్, హోటల్‌లో. ఆమె ఫొటో చూసి చాలా తాజ్జుబ్ అయింది సాబ్. ఆమె గురించి యేదో వ్రాసివుంది. కానీ నాకు ఉర్దూ చదవ రాదు, మాట్లాడుతాను. పక్కవాడితో చదివించి తెలుసు కున్నా. ఆమె చంపబడిందట! ఖతల్! చాలా పరేషాన్ అయినా....నిన్న సాయంత్రమే ఆమె నా ఆటో ఎక్కింది! ఆమెకెవరూ లేరని పేపర్లో వుంది. ఎక్కడ నౌకరీ చేస్తుందో కూడా తెలియదట....ఆమె గురించి తెలిసిన వాళ్ళు ఫౌరన్ పోలీస్‌కు, లేదా మీకు తెలియపర్చి మదద్ చేయమని వ్రాసారు."

లాల్ తలూపాడు.

"డిటెక్టివ్ సాబ్, మీరు జనూసీ చేస్తారు. చోర్‌లనీ, ఖూనీఖోర్‌లనీ పట్టుకుంటారు. ఆమెని చంపిందెవరో మీరు జల్దీ పట్టుకోవాలి! నిన్న సాయంత్రం 7 : 30కి ఆమె నా ఆటో ఎక్కింది. నేనప్పుడు దిల్‌సుఖ్ నగర్ డిపో దగ్గర వున్నా. అక్కడే ఆమె ఆటో ఎక్కింది. చాలా పరేషాన్ కన్పించింది. జల్దీ చలో అంది నాంపల్లికి. గాడీ పోతున్నప్పుడు మాటిమాటికీ వెనుక చూడసాగింది. మలక్‌పేట్ ఓవర్ బ్రిడ్జి కాడ 'డ్రైవర్! వెనుక మోటార్ సైకిలు వస్తోంది, తేజ్ పోనివ్వు!' అనర్చింది."

"మోటార్ సైకిల్?"

"అవును సాబ్. ఆమె చాలా భయపడింది. ఇంకా వేగం పోనివ్వమంది. నేను బండి జోరుగా దబాయించినా. సైకిల్ మోటార్ ఖరీబ్ అవుతున్నదని ఆమెది ఒకటే జల్ది! కానీ ఆ గాడీవాలా అసలు ఓవర్ టేక్ చేయలేదెంతకీ! ఆమె అతన్ని వదిలించుకోవాలని జబర్దస్తీ చేయసాగింది. ఎక్కడెక్కడో చక్కర్లు తిప్పసాగింది— కోఠీ, కాచిగూడ, నారాయణగూడ, అక్కడనుంచి ఆబిడ్స్ పోనివ్వమంది. నేనప్పుడన్నా, 'మేంసాబ్, అతడెవరు? బండాపి కమర్ కైమా చెయ్యనా?' అని. వద్దంది. పోలీస్ స్టేషన్‌కి పోనివ్వనా అన్నాను.అదీ వద్దంది. నాకేదీ సమజ్ కాలేదు....ఆఖర్కి ఎలాగో ఆబిడ్స్‌లో వాడ్ని గుమ్‌నామ్ చేసినా సాబ్. బెచారు గుమ్ అయిపోయాడు. అప్పుడు ఖుషీగా నాంపల్లీ తోలినా."

"అప్పుడు టైమెంతయింది?"

"తొమ్మిదయింది సాబ్. నాంపల్లీలో ఒక ఇంటికాడ ఆపమంది. అక్కడ దిగి ఇదే మా ఇల్లు, తుమ్ జావ్ అంది. ఇరవై రూపాయలిచ్చింది సాబ్. నేనయిదే తీసుకున్నా. 'బహెన్, తుమ్ సంభల్ కె రహెనా!'అన్నా. అక్కడనుంచి వచ్చేసినా.

"కానీ సాబ్, ఆ గాడీవాలా వస్తాడేమోనని అనుమానంతో గల్లీ చివర అరగంట కూర్చున్నా. వాడు రాలేదు. అయితే వాడికామె ఇల్లు తెలియదని నమ్మకం చేసుకుని వెళ్ళిపోయా. కానీ సాబ్, ఇవాళ పేపర్లో ఇలా చూసి నాకు—"

"ఆ గాడీవాలా ఎలా వుంటాడో నువ్వు చూశావా?"

"లేదు సాబ్. రాత్రి సమయం. వాడు నల్ల డ్రస్సు వేసుకున్నాడు."

"మోటారుసైకిలు నెంబర్?"

"చూడలేదు. వాడు నా వెనుకే వున్నాడు అంత సేపూ."

"ఆ అమ్మాయి దగ్గర ఏం ఉన్నాయి?"

"ఒక్క బ్యాగ్ సాబ్."

"బ్యాగులో యేమున్నాయో డబ్బిస్తున్నప్పుడు చూశావా?"

"లేదు సాబ్, చీకటి."

"ఆ ఇల్లు తనదని చెప్పిందా?"

"అవును సాబ్."

"ఆ ఇల్లు యెక్కడుంది?"

"చెప్తే సమజ్ కాదు సాబ్, చూపిస్తాను."

"అయితే ముందు నీ అడ్రసు, ఆటో నెంబర్ ఇవ్వు."

అతడు చెప్పాడు. జాన్ వ్రాసుకున్నాడు.

అయిదు నిమిషాల్లో డిటెక్టివ్‌లు క్రింద కార్లో వున్నారు. జాన్ డ్రైవ్ చేస్తున్నాడు. ముందు రెహమాన్ తన ఆటో పోనిస్తున్నాడు.

"పార్టనర్, ఇది గొప్ప రిలీఫ్ కదూ?" అన్నాడు జాన్ ఉత్సాహంగా. "టైం ఎలిమెంట్ గురించి వివేక్ స్టేట్‌మెంట్ ఇప్పుడు రుజువవుతోంది కదూ? హత్యా సమయంలో మార్గరెట్ ఎక్కడ వుందన్నది ముఖ్యం. అప్పుడామె తోటలో వివేక్‌తో లేదు! ఎవరో కరితో నాంపల్లీలో ఉంది...."

"అవును. కానీ ఆ మోటార్ సైకిలు మనిషిని ట్రేస్ చేయడమెలా?"

"అతన్ని ఎందుకు లాగుతున్నా విందులోకి? గుమ్‌నామ్ అయిపోయాడు కదా?"

"గుమ్‌నామ్ ఎవరూ కారు, బద్‌నామ్ చేయడానికి కాకపోతే."

"వెల్, వెల్, వన్స్‌మోర్!"

లాల్ నోరు మూసుకున్నాడు.

పది నిమిషాల్లో కారు నాంపల్లిలో ఓ ఇంటి ముందాగింది. పెద్ద విశాలమైన బంగళా. దాదాపు శిథిలావస్థలో వుంది. మనుష్య సంచారం లేదు. దారుణమైన నిశ్శబ్దం. గేటు ప్రక్కన ప్లేటుమీద బ్రహమ్‌ప్రకాష్ గోయెల్, ఎక్స్‌పోర్టర్ అని వుంది.

"ఈ ఇల్లేనా?" లాల్ అడిగాడు, లోపల ఒక పాత డాడ్జి కారును చూస్తూ.

"అవును సాబ్" రెహమాన్ అన్నాడు.

జాన్ గేటు తట్టి చూశాడు. లోపల గడియ పెట్టి వుంది. దాన్ని తీయబోతుంటే లోపల ఒక్కసారిగా అరుపులు విన్పించాయి... వాటితోబాటు రెండు జంతువులు మెరుపులా వెలుపలికి వచ్చాయి. అవి మంచి ఎత్తుగల బలిష్టమైన అల్సేషన్ కుక్కలు.

గేటు చేరుకొని, కాళ్ళతో కడ్డీలు పట్టుకొని నిలబడి బిగ్గరగా మొరగాసాగాయి. మెడదగ్గర వాటి నిక్కబొడుచుకున్న బొచ్చు చూసి, పొడుగ్గా మొనదేలిన దంతాలు చూసి, ముగ్గురూ వెనక్కి దూరంగా తప్పుకున్నారు.

అంతలో వరండాలో ఒక ఆకారం ప్రత్యక్షమైంది. అతను లావుగా, పొట్టిగా వున్నాడు. నోట్లో పైప్ కాల్తోంది. గళ్ళ పైజామా, కుర్తాలో వున్నాడు. అతను

కొన్ని క్షణాలు అలాగే గమనించి అప్పుడు చప్పట్లు చరిచాడు. "రేజర్! హంటర్! కమాన్, కమాన్ మై సన్స్!"

కుక్కలు మంత్రం వేసినట్లు అరుపులా పేసి తోకాడిస్తూ యజమానివద్దకు ఉరికాయి. అతను రమ్మని చెయ్యూపి సైగ చేశాడు.

ముగ్గురూ గేటు తెరచి లోనికెళ్ళి అతన్ని చేరు కొన్నారు.

"హలో....ఎవరు మీరు?" అన్నాడతను అనుమా నంగా చూస్తూ.

"లాల్ అండ్ జాన్, పార్ట్‌నర్స్ ఇన్ డిటెక్షన్" లాల్ అన్నాడు.

అతను ఉలికిపడి, "మీరా! ఏం పని?" అన్నాడు మరింత అనుమానంగా.

"లోనికి పదండి, మాట్లాడుకుందాం."

అతను క్షణం సంకోచించి తలూపాడు. వెనక్కి తిరిగి లోనికెళ్ళాడు. అలా వెళ్తూ రహస్యంగా అతను కుక్కలకి చేసిన సైగ డిటెక్టివ్‌లు గమనించకపోలేదు.

అవి హఠాత్తుగా ముందుకెగిరి డిటెక్టివ్‌లని తడిమి చూశాయి. నాకి చూశాయి. కాళ్ళు ఛాతీకాన్చి నిల్చుని కంఠానికి ముక్కుపుటాలు తాకించాయి. ఇద్దరూ ఊపిరి బిగబట్టి కదలకుండా నిల్చున్నారు. రెహమాన్ తన వంతుకోసం కాచుకొని దేవుణ్ని ప్రార్థిస్తున్నాడు. హఠాత్తుగా అవి దూరంగా దూకి ఇందాకటిలా మొరగ నారంభించాయి....అదే క్షణంలో ఆ పొట్టిమనిషి వేగంగా బయటికొచ్చాడు. "ఓ. కే! ఓ. కే! కమాన్, సన్స్! బి సెన్సిబుల్."

అవి రెండూ చల్లబడి యజమాని ప్రక్కన చేరాయి.

"రండి! ఇవేమీ చెయ్యవు. నా రక్షణ గురించి చాలా జాగ్రత్తలు తీసుకుంటాయి...." అతని కంఠంలో హామీ హెచ్చరికా రెండూ వున్నాయి.

ముగ్గురూ అతన్ని అనుసరించారు.

"లాల్, మనం శత్రువులమని అతనికి తెలిసిపోయింది" జాన్ అన్నాడు చిన్నగా. లాల్ తలూపాడు.

పొట్టిమనిషి సోఫాలో కూర్చొని, వాళ్ళనీ కూర్చో మన్నాడు. కుక్కలు యజమానికి చెరో ప్రక్క చేరి ఆగంతకుల్ని కనిపెట్టసాగాయి.

"చెప్పండి, ఏమిటి పని?" అన్నాడతను.

"మార్గరెట్ గురించి" లాల్ అన్నాడు ముక్తసరిగా.

అతని కళ్ళు విశాలమయ్యాయి క్షణంసేపు. వెంటనే నోట్లోంచి పైప్ తీసి ముందుకి వంగాడు, "ఎవరామె?"

"మీకు తెలుసు. నిన్న రాత్రి తొమ్మిది గంటలకు ఇక్కడకొచ్చింది. ఉదయం పేపర్లో ఆమె హత్య సంగతి చదవలేదా?" అన్నాడు జాన్.

అతని కళ్ళు తీక్షణమయ్యాయి ఈసారి.

"మీరు పొరబడ్డారు, రాత్రి ఇక్కడెవరూ రాలేదు."

లాల్ నవ్వాడు. "నిర్ధారణ చేసుకొనే వచ్చాం, మిస్టర్ గోయెల్."

"ఏమిటి రుజువు?"

"ఈ ఆటో డ్రైవర్. ఇతడామెని మీ ఇంటిముందు డ్రాప్ చేశాడు. ఆమె గేటు తెరిచి లోనికెళ్ళింది—"

"ఆగండి. గేటు తెరిచి లోనికొచ్చిందా? అసంభవం."

"అదెలా?"

"రాత్రిళ్ళు కుక్కలు పహరా కాస్తుంటాయి. ఎవరు

గేటులోంచి ప్రవేశించినా మొరిగి అక్కడా పేస్తాయి. గోడదూకివస్తే మీదపడి కండలు పీకేస్తాయి."

"వెల్—" జాన్ అనబోయాడు.

కానీ గోయెల్ వెంటనే అన్నాడు. "మీరు చెప్పిన అమ్మాయి అలా లోనికొస్తే కుక్కలు మొరుగుతాయి. నేను బయటికొస్తాను. వీధిలో జనం దృష్టి కూడా ఇటు పడుతుంది. ఈ డ్రైవర్ కుక్కలు మొరగ్గా విన్నాడా?"

లాల్ అడ్డంగా తలాడించాడు. "లేదు—కానీ, మార్గరెట్ ఇక్కడ తరచు వస్తుండాలి. కుక్కలు ఆమెకి అలవాటై వుండాలి."

"ఆ పేరుగల అమ్మాయి ఎవరూ ఇక్కడికి రాలేదెప్పుడూ."

"వెల్, రాత్రి వస్తున్నట్లు తెలిసి మీరు కుక్కల్ని రప్పించుకొనుండాలి. ఆమె మీ దగ్గర ఉద్యోగం చెయ్యడం లేదా?"

"ప్లీజ్ షటప్! ఆమె ఎవరో నాకసలు తెలియదు!"

"ఆమె గేటుతీసి లోనికి పోతూంటే కళ్ళారా చూసిన సాబ్!" అన్నాడు రెహమాన్.

"ఏ ఇంటిదగ్గర డ్రాప్ చేశావురా గద్దార్ కహీంకా!" గోయెల్ గొంతు చించుకొని అర్చాడు.

రెహమాన్ ఆవేశంగా అతనిమీద దూకబోయాడు. కుక్కలు మెరుపులా కదిలాయి. జాన్ విసురుగా అతన్ని వెనక్కి లాగాడు.

"రెహమాన్! ఆవేశపడకు! అవి నీ గుండెలు విప్పదీస్తాయి."

రెహమాన్ చల్లబడుతూ అసంతృప్తిగా కూలబడ్డాడు.

"వెల్ మిస్టర్ గోయెల్, మీరలా రెచ్చిపోకండి!"

లాల్ అన్నాడు శాంతంగా.

"నిన్న రాత్రి ఆ అమ్మాయిని సరూర్‌నగర్ నుంచి ఒక మనిషి మోటార్ బైక్ మీద వెంటాడాడు. ఆమె ఇతని ఆటోలో తప్పించుకుంటూ ఎక్కడెక్కడో తిరిగి ఈ ఇంటిముందు దిగింది. లోనికి వచ్చింది. ఆగంతకుడినుంచి తప్పించుకోనేందుకు ఆమె ఈ ఇంట్లోకి రాలేదు. ఆటో ఎక్కినప్పుడే ఈ ఇంటి అడ్రసు చెప్పి ఉద్దేశపూర్వకంగా వచ్చింది. ఆమె ఉద్యోగం ఎక్కడో ఎవరికీ తెలియదు. రహస్యంగా వుంచింది. అలా రహస్యంగా వుంచడమూ, రాత్రి ఈ ఇంట్లోకి రావడమూ, ఇప్పుడిక్కడి వాతావరణమూ, మీ వాలకమూ చూస్తే—అంతా ఏదో గూడు పుఠాణిలా ఉంది. మీరేం బిజినెస్ చేస్తున్నారు?"

"ఎక్స్‌పోర్టింగ్, మైడియర్ యంగ్‌మాన్."

"ఏం ఎక్స్‌పోర్టింగ్?"

"మీరొచ్చిన పనికి దానితో నిమిత్తంలేదు."

"మార్గరెట్ చేసే ఉద్యోగానికీ మీకూ సంబంధముంది. ఆమె మీ వుద్యోగి కాదని అంటున్నారు. నిజం తెలుసుకొంటాం. కానీ ముందు నా అయిడియా వినండి. ఆమెకూ మీకూ తప్పకుండా ఏవో డీలింగ్స్ వున్నాయి. అవి నిన్న బెడిశాయి. ఫలితంగా ఆమె మిమ్మల్ని-వెల్-రివాల్వర్‌తో బయలుదేరి ఇక్కడికొచ్చింది. ఆమె వస్తోందని మీకెలాగో తెలిసి కుక్కల్ని తప్పించుకున్నారు. ఆమెని లోనికి రానిచ్చారు. అప్పుడు జరిగిన వాదనలో—వెల్—ఘర్షణలో దురదృష్టవశాత్తు ఆమె-ని—"

లాల్ చటుక్కున లేచి అన్నాడు. "ఓ. కే. ఏం జరిగిందో మీకు తెలుసు. ఇప్పుడేం జరుగుతోందో కూడా

మీకు తెలుసు.... మీరిక్కడ ప్రేక్షకుడిలా చూస్తూ కూర్చుని ఆనందిస్తున్నారు. వివేక్ పట్ల మీకు కనీసం జాలి, సానుభూతి లేవు. మీకసలు మానవత్వం లేదు. ఆ అమాయకుడు ఈ కేసులో సీరియస్‌గా ఇరుక్కున్నాడు. ఆల్ రైట్ ఇప్పుడిప్పుడే అంతా అర్థమవుతోంది....మీరిలాగే తిలకిస్తుండండి. అమాయకుల్ని కాపాడ్డంలో మేమెప్పుడూ విఫలం కాలేదు. కమాన్ జాన్, లెట్స్ గో!"

లాల్ విసురుగా తిరిగి బయటికెళ్ళిపోయాడు.

జాన్, రెహమాన్ అతన్ని అనుసరించారు.

గోయెల్ వాళ్ళనలాగే కళ్ళార్పకుండా చూస్తూండి పోయాడు. కుక్కలు కదల్లేదు.

"వి మస్ట్ డూ సమ్‌థింగ్!" జాన్ అన్నాడు, బయటికొచ్చాక ఆందోళనగా.

లాల్, రెహమాన్‌తో అన్నాడు. "నువ్విక జాగ్రత్తగా వుండాలి, నీకిప్పుడు ప్రమాదముందని అర్థమైందను కొంటాను."

"నాకేంకాదు సాబ్, ఫికర్ చెయ్యకండి. వాడ్ని జల్దీ పట్టుకోండి!"

"అలాగే కానీ నీ జాగ్రత్తలో నువ్వుండు."

"అచ్ఛా సాబ్, మై జాతూం" రెహమాన్ ఆటో ఎక్కి వెళ్ళిపోయాక లాల్ కారు స్టార్టు చేశాడు.

"ఎక్కడికి?" అన్నాడు జాన్.

"నిన్ను వీధి చివర డ్రాప్ చేస్తాను. గోయల్ ఇంటి మీద కన్నేసి వుంచాలి. అతను ఎక్కడైనా బయలు దేరవచ్చు. నువ్వు కనిపెట్టి వుండాలి."

# 7

లాల్ ఆఫీసుకు తిరిగివచ్చాక కృష్ణన్‌నుంచి ఫోన్ వచ్చింది.

"హలో, పేపర్ ప్రకటన ఫ్లాప్! ఇంక ఎటువంటి సమాచారంగానీ, టిప్‌గానీ అందే దిక్కులేదు. మీ రెలా వరిలుతున్నారు?"

"బ్రహ్మాండంగా! కానీ మీ జోక్యం అనవసరం. మీరు తొందరపడతారు. మా దగ్గర బలగముందీ, ఆయుధాలున్నాయంటూ బయలుదేరుతారు. అప్పుడే అవుతుంది అసలు ఫ్లాప్!"

"అంటే, నా గురించి ఏమిటి మీ అభిప్రాయం? ఫ్లాప్ మాస్టర్ జనరల్ అనుకొంటున్నారా?"

"ఓహ్, కాదు. మీరలా అపార్థం జేసుకోకండి. ఈ అనుమానితుడి మీద ముందు రుజువులు సేకరించాలి. దూకుడుగా వెళితే లాభంలేదు. మేం అన్ని రుజువులు సేకరించి సులభ పద్ధతిలో శాంతియుతంగా మీకతన్ని అప్పగిస్తాం. పి. యస్. అప్పగింతలంటే నాకు చాలా ఇష్టం" లాల్ ఫోన్ పెట్టేశాడు.

మధ్యాహ్నం రెండు గంటలకు జాన్ ఫోన్ చేశాడు.

"పార్ట్‌నర్, గంటసేపు ఎదురు చూశాను. ఏమీ జరగలేదు. ఇక జరగదనుకొని నేనే రంగంలో దిగాను. పొరుగిళ్ళలో దర్యాప్తుచేశాను. ఆ మోటార్ బైక్ అతను గోయెల్ మనిషేనట. అతడు ఆరోగ్యవంతుడు. బల వంతుడు. సకల గుణవంతుడు. రోజూ వచ్చి పోతుం టాడు. నివాసం ఎక్కడో తెలియదు. బైక్ నెంబర్ ప్రత్యేకంగా ఎవరూ గమనించలేదు."

"ఇంకా?"

"అతని పేరు మహేష్. వాళ్ళిద్దరు కలిసి ఏంచేస్తుంటారో ఎవరికీ తెలియదు. అది మామూలు బిజినెస్ కాదు, గూడుపుఠాణీ అంటున్నారు. రాత్రి 9 గంటలకి మహేష్ ఇంటికి రావడం—గోమెల్ ఇంటికి—ఒకరు చూశారు. రాత్రి షాట్స్ ఎవరికీ విన్పించలేదు. ఆ బంగళాని చూస్తే విన్పించవన్పిస్తోంది....మహేష్ ఇప్పుడు వచ్చేలాలేదు. అతనికోసం ఇంకా దర్యాప్తుచెయ్యాలనుకొంటున్నాను."

"చెయ్!"

"మరి నువ్వేం చేస్తున్నావ్?"

"ఆలోచిస్తున్నాను" అని లాల్ ఫోన్ పెట్టేశాడు.

గంట తర్వాత వివేక్ తండ్రి ఫోన్ చేశాడు.

"మిస్టర్ లాల్ ఏం జరుగుతోంది? ఎంతవరకొచ్చింది? చెప్పండి!"

అతని కంఠంలో ఉద్రిక్తత గమనించి లాల్ ప్రశాంతంతా అన్నాడు:

"భయంలేదు ఇప్పుడు. నిశ్చింతగా వుండండి. వివేక్ క్షేమంగా తిరిగివస్తాడు."

"నిజంగా?....నిజంగానా?"

"అవును, నిజంగా. అంతా నెమ్మదిగా, సజావుగా జరుగుతుంది....మీరు నిశ్చింతగా వుండండి. అన్నట్లు ఈ రాత్రి బొంబాయి వెళుతున్నాను."

"బొంబాయికా? ఎందుకు? మరిక్కడ కేసు?"

"జాన్ చూసుకొంటాడు. నేను వెళ్ళడం చాలా ముఖ్యం. రేపు ఉదయం స్పెయిన్‌నుంచి ఫ్రెండ్ వస్తున్నాడు. రిసీవ్ చేసుకోవాలి" లాల్ రిసీవర్ పెట్టేశాడు.

ఆ తరువాత గంట సేపు వరుసగా ముగ్గురు క్లయింట్స్‌తో

మాట్లాడుతూ గడిపాడు.

సాయంత్రం 4 గంటలకి జాన్ మళ్ళీ ఫోన్ చేశాడు.

"లాల్, మహేష్ నడుపుతున్నది పాత నార్టన్ బండి అని తెలిశాక రిపేర్స్ కోసం ఎక్కడికెళ్తాడా అని ఆ చుట్టుప్రక్కల మెకానిక్ షాపుల్లో చూస్తూ పాద యాత్ర చేస్తోంటే—నువ్వు నమ్మవుగానీ—ఒకచోట అది కన్పించింది లాల్!"

"నమ్ముతాను, యూ కెన్ ప్రొసీడ్!"

"ఉదయం 6గంటలకి మహేష్ దాన్నక్కడ పెట్టేసి వెళ్ళాడట. ఊరికెళుతున్నట్లు చెప్పాడట. బండి రిజిస్ట్రేషన్ గోయెల్ పేరిటవుంది. ఎప్పుడూ రిపేర్సేనట!... మెకానిక్‌కి మహేష్ ఇల్లు తెలుసు. వారిస్‌గూడలో వుంది. అక్కడికెళ్ళాను. ఇంటికి తాళం వుంది-నిజంగా ఊరికెళ్ళాడంటావా? నాకు నమ్మకంలేదు. పక్కింటి వాళ్ళు భార్యతో కలిసి వెళ్ళాడంటున్నారు...."

"ఆల్‌రైట్, గోయెల్ ఏం చేస్తున్నాడు?"

"పార్ట్‌నర్, అతను చాలా నెమ్మదస్తుడు. పరమ సాధువు. శాంతస్వభావుడు. ఇందాక చూసినపుడు కత్తెర పట్టుకొని తోటలో మొక్కలు కత్తిరిస్తున్నాడు."

"నో, జాన్. మహేష్ పారిపోయి వుండడు, బాస్‌ని ఇక్కడ వంటరిగా వదిలి అదీ ఇలాంటి పరిస్థితిలో! నిజంగా వూరికెళ్ళి వుంటే ఏ వూరు వెళ్ళాడో, ఎలా వెళ్ళాడో కనుక్కోగలవా!"

"ప్రయత్నిస్తాను. మరి నువ్వేం చేస్తున్నావక్కడ?"

"ఆలోచిస్తున్నాను" అని లాల్ ఫోన్ పెట్టేసి ఆలోచించసాగాడు.

చీకటి పడుతోండగా ఏడు గంటలకి ఆఫీసులో ఒక

వృద్ధుడు ప్రవేశించాడు. అతని వెంట్రుకలు పూర్తిగా నెరసి, ముఖం మీద చర్మం ముడతలు పడింది. తెల్లటి దుస్తుల్లో వున్నాడు. కళ్ళద్దాలు పెట్టుకున్నాడు. వయసు డెభ్భై వుంటుంది.

అతను లాల్‌ని విష్‌చేసి కూర్చున్నాడు. ముఖంలో చాలా కంగారు వుంది.

"మిస్టర్ లాల్, నేను అచ్యుతరావుని—ఆర్కిటెక్ట్" అన్నాడతను చటుక్కున.

లాల్ తేరిపార చూశాడు. "యస్?"

"మిస్టర్ లాల్, మిమ్మల్ని కలుసుకోవడంలో ఆలస్యము జరిగినందుకు మన్నించండి. నేను భయపడ్డాను, నా రిప్యూటేషన్ గురించి. ఈ సంఘటనలో నా పేరు బయటకొస్తే నా విలువయిన క్లయింట్స్‌ని కోల్పోతాను. ఆ స్టుపిడ్‌ని ఎంతో హెచ్చరించాను — నువ్వు బయట స్నేహాలు చెయ్యకూ, నీ గురించి ఎవరికీ చెప్పకూ, నీ ఉద్యోగం కూడా చాలా రహస్యంగా వుంచాలీ అని."

లాల్ అమాంతంగా ముందుకు వంగిపోయాడు. "మార్గరెట్ గురించా మీరు చెప్పేది?"

"అవును, మార్గరెట్ గురించి. ఆర్నెల్లుగా నా దగ్గర పని చేస్తోంది. ప్రత్యేకంగా నాకు ఆఫీసు లేదు. ఇంట్లోనే పని చేస్తాను. అసోసియేట్స్ యెవరూ లేరు. ఒక్క మార్గరెట్‌నే ఇటీవల సహాయంగా తీసుకున్నాను. నా వృత్తి చాలా రహస్యమైనది కనుక నా ఉనికి ఎవరికీ తెలియకూడదు. అందుకని అజ్ఞాతంగా వుంటాను. నేను మామూలు బిల్డింగ్ ఆర్కిటెక్టును కాను. అత్యంతరహస్యమైన కట్టడాల్ని ప్లానింగ్ చేస్తుంటాను .... కోటీశ్వరుల రహస్యాగారాలనుంచి, ప్రభుత్వానికి చెందిన వివిధ

సెక్యూరిటీ వ్యవస్థల వరకూ ప్లాన్స్ తయారుచేసి ఇస్తుంటాను.... నా మీద ప్రభుత్వానికీ, ఆయా సంస్థలకీ మంచి విశ్వాసముంది....

క్లుప్తంగా చెప్పాలంటే నా క్లయంట్స్ రక్షణ భవితవ్యం నా చేతుల్లో వుంది. అందుకే మార్గరెట్ ని ఉద్యోగ రహస్యం పొక్కకుండా జాగ్రత్తగా మసలుకోవాలని ఎన్నోసార్లు హెచ్చరించాను. యిలాంటి అమ్మాయిల్ని చేరదీసి తమ పబ్బం గడుపుకోవడం దుష్టశక్తులకు ఎంతో సులువు. ఇన్నేళ్ళూ నేను అసిస్టెంట్ సహాయం లేకుండా నే పనిచేస్తూ వచ్చాను. కానీ ఈ మధ్య వయసు భారంవల్ల అలసట ఎక్కువవుతోంది. ఎంతో తప్పనిసరి పరిస్థితిలో నే మార్గరెట్ ని నియమించుకున్నాను.

"ఈమెని తీసుకోనే ముందు చాలా పరికించి చూశాను. మంచి రికార్డ్ వుంది. కారెక్టర్, నడవడి ఉత్తమంగా వున్నాయి. అన్నింటికీ మించి అనాథ. ఆమెకు ఎవరూ లేకపోవడం అన్నివిధాలా మంచిది. అందుకే తీసుకున్నాను. బాగా నమ్మాను....అయినా వయసు అలాంటిది గనుక బయటి ఆకర్షణలకి లోనయ్యే సమస్య ఒకటుంది. అందువల్ల బయట ఎవరితోనూ—అది స్త్రీ కానీయండి, పురుషుడే కానీయండి— స్నేహం చెయ్యకూడదని ఆంక్ష పెట్టాను. దాన్ని ఉల్లంఘిస్తే తీవ్రంగా శిక్షిస్తానన్నాను. జన్మంతటికీ అది మచ్చగా మిగిలిపోతుందని హెచ్చరించాను."

"ఎలాంటి శిక్ష? ఏవిధంగా శిక్షించాలనుకున్నారు?"

"ఎలా శిక్షించాలనుకొన్నా ఇప్పుడవకాశం లేదుగా! ఆ స్టుపిడ్ నా కళ్ళు గప్పి తిరిగింది బాయ్ ఫ్రెండ్ తో. నా హెచ్చరిక గాలికి వదిలింది. ఉద్యోగధర్మం నిర్లక్ష్యం

చేసింది. వాటన్నింటి ఫలితంగా తగిన శిక్ష పొందింది! డామ్‌స్టుపిడ్! పిచ్చిది. పిచ్చి—వెర్రి—బుద్ధిలేని గాడిద!"

తళుక్కున అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఆమె అలా చేస్తోందని మీకు తెలీదా?"

"ఈ ఉదయం పేపరు చదివాకే తెలిసింది."

"తెలిసి ఏం చేశారు?"

"ఏం చేస్తాను? నా చేతుల్లో ఏముంది? ఆమె చని పోవటం, బాయ్‌ఫ్రెండ్ హంతకుడుగా పట్టుబడటం— అంతా ముగిసింది. ఇంకేం వుంటుంది చెయ్యడానికి? నా సహకారం మీకేం అవసరమింకా? అందుకే మిమ్మల్ని కలుసుకోలేదు."

"మరిప్పుడు ...."

"ఇప్పుడు వచ్చింది మార్గరెట్ విషయంలో కాదు."

లాల్ అతన్ని సూటిగా చూశాడు. "ఐసీ....మరి?"

"మరో విషయంలో, దొంగతనం గురించి—"

"దొంగతనమా—మామీదా?"

"ఓహ్, ముందు అర్థం జేసుకోండి! రాత్రి నా ఇంట్లో దొంగ ప్రవేశించాడు. ఒంటిగంట అవుతోంది అప్పుడు. బెడ్‌రూమ్‌లో చప్పుడు విని కళ్ళు తెరిచాను. సేఫ్ దగ్గర ఒక ఆకారం కన్పించింది.... దాన్ని తెరవటానికి ప్రయత్నిస్తోంది. నేను కేక వేశాను. అది అమాంతం నా మీద పడి కడుపులో గుద్ది పారిపోయింది."

"ఆ ఆకారం ఆడా, మగా?"

"మగ—మగ దొంగ!"

లాల్ ముఖం ఎర్రబడుతోంది.... "మీ సేఫ్‌లో ఏమున్నాయి?"

"ప్లాన్స్. ఎప్పటి కప్పుడు వాటిని క్లయంట్స్‌కిచ్చే

స్తుంటాను. డూప్లికేట్స్ వుంచుకోను. నా దగ్గరిప్పుడు రెండు ప్లాన్స్ సిద్ధమై వున్నాయి. రెండు రోజుల్లో వాటిని క్లయింట్స్ కందించాలి—కాన్పూర్ లో ఒకటి, బెంగుళూరులో ఒకటి. వాటి వివరాలు మీకు చెప్పను. కానీ అందులో ఒకటి ప్రభుత్వానిది."

"వాటి కోసమే దొంగ వచ్చాడంటారా?"

"అవును. ముఖ్యంగా ప్రభుత్వ ప్లానుకోసం."

"మీరు దొంగను స్పష్టంగా చూడలేదా?"

"లేదు. గది చీకటి చేశాడు. కానీ ఢీకొన్నప్పుడు లావుగా, పొట్టిగా ఉన్నట్టు గ్రహించాను. రాత్రి విఫలమయ్యాడు. వాడు మళ్ళీ ఈ రాత్రి వస్తాడు. మీకిప్పుడు పరిస్థితి తెలిసిందనుకొంటాను. నా రాక వుద్దేశం గ్రహించారనుకొంటాను."

లాల్ కళ్ళు అకస్మాత్తుగా మెరిశాయి. "అర్థమైంది, అర్థమైంది మిస్టర్ రావ్! మీరు చూయింగ్ గమ్ తింటారా?"

రావ్ అయోమయపడి చూశాడు.

లాల్ సొరుగులాగి ఒక పాకెట్ తీశాడు, "కమాన్! ఒక్కటి తినండి! నేను అర్జంటుగా బొంబాయి వెళ్లాలి.... ప్లీజ్!" అంటూ ఆ పాకెట్ అతనికిచ్చి ఏవో సూచనలు చేయసాగాడు.

# 8

జాన్ ఇంటికి చేరేటప్పటికి రాత్రి 11:30 కావస్తోంది. అతను అలసటగా తాళంతీసి లోనికెళ్ళి లైటు వేశాడు. షర్టు విప్పుతూ బెడ్ రూంలోకి నడిచి మూడుసార్లు ఆవులించాడు.

చుట్టూ చూస్తూ కళ్ళు చిట్లించి, వెంటనే ఉలిక్కి

పడ్డాడు. వేగంగా ఫోన్ ఎత్తి ఏర్‌పోర్టుకి డయల్ చేసి మాట్లాడిన అతనికి, బొంబే ఫ్లైట్ నెం. 120 పదీ ఏడుకి బయల్దేరి వెళ్ళిపోయిందని తెలిసింది....

'డామిట్! కేసు ఎటూ గాకుండా వదిలి చెక్కేశాడు!' పట్టుకున్నాడతను. ఆ కోపంతో వెళ్ళి వార్డ్ రోబ్ తెరిచి లాల్ బట్టలు చింపెయ్యాలనుకున్నాడు. కానీ, అనుకోకుండా దృష్టి అవతల టేబిలుమీద పడ్డంతో వేగంగా కదిలాడు.

టేబిలుమీద ఒక కాయితం పేపర్ వెయిట్ పెట్టి కన్పించింది. జాన్ దాన్నందుకుని కళ్ళు విశాలం చేసి చూశాడు.

'పార్ట్‌నర్, సేఫ్‌లో కేసెట్ వుంది. దాన్ని డెక్‌లో వేసి విను!'

జాన్ వేగంగా వెనుక గదిలోకెళ్ళి కాంబినేషన్ తిప్పి సేఫ్ తెరిచేశాడు. మధ్య షెల్ఫులో కన్పించిన కేసెట్ అందుకొని తిప్పితిప్పి చూశాడు.

దాంతో కలవరంగా బెడ్‌రూంలో కొచ్చి డెక్‌ని సమీపించాడు. దాన్ని సాకెట్‌లో వేసి మీటలు నొక్కాడు. తిప్పాడు. స్పీకర్లు గోడ కిరువైపులా హఠాత్తుగా ప్రాణం పోసుకొని గరగరమన్నాయి. అతను అక్కడే స్టూలుమీద నిటారుగా కూర్చొని చెవులు రిక్కించాడు:

కొన్ని క్షణాలయ్యాక లాల్ గొంతు అకస్మాత్తుగా పలికింది:

"జాన్, మైడియర్ పార్ట్‌నర్, నేనిలా వెళ్ళిపోవడం నీకు కోపంగా వుందికదూ" చిన్నగా నవ్వి, "నాకు తెలుసు. కాని ఏం చెయ్యను? ఇలా చెయ్యక తప్పలేదు.

బొంబాయి వెళ్ళకపోతే, రేపుదయం కమల్‌ని రిసీవ్ చేసుకోకపోతే, చిన్నబుచ్చుకుంటాడు; అలిగిపోతాడు; మళ్ళీ ముఖం చూపించొద్దంటాడు. నాకంటే పాపం అతడికి ఆత్మీయులు లేరు.... పూర్ ఫెలో, అనాథగా పెరిగాడు. అయిదేళ్ళ తర్వాత ఇండియాకొస్తున్నాడు. తనతో వారం రోజులు గడిపితేగాని తృప్తిచెంది వదలడు. దిగులు పడకు ఇక్కడ అన్ని ఏర్పాట్లు చేశాననే నమ్మి వెళ్తున్నాను... నా మాటలు జాగ్రత్తగా విను! విన్నాక చెప్పినట్టు చెయ్యి. చేశాక ఈ టేపుని కృష్ణన్‌కి విన్పిస్తే వివేక్‌ని వదిలేస్తాడు. వింటున్నావా? ఇది డిటెక్టివ్ లాల్ ఉవాచ."

అంత కోపంలోనూ జాన్‌కు నవ్వాగలేదు.

యూ ఆరే ఫన్నీ పార్టనర్ యార్! అనుకున్నాడు సంతోషంగా.

".... వెల్, జాన్. నీకోసం ఇంతసేపూ చూసి ఈ ఏర్పాటు చేయాల్సి వచ్చింది హడావుడిగా.... సమయం లేదు, ఫ్లైట్ టైం అవుతోంది. నువ్వింతవరకూ తిరిగి రాలేదంటే, నీనుంచి కనీసం ఫోన్ కూడా రాలేదంటే, ఇంకా మహేష్ జాడ తెలియలేదని అనుకోవలసివస్తోంది. అంతేనా? అయితే నిరాశపడకు! మహేష్ తప్పక దొరికిపోతాడు నా అనుమానం నిజమైతే—

"మైడియర్ పార్టనర్, నా అనుమానం ఏమిటనుకున్నావ్? సిల్లీ .... ఈ అనుమానం, ఇంత చిన్న మామూలు విషయం మనం గమనించకపోవడం నిజంగా సిగ్గుచేటు! షేమ్. ఇందాక రావ్ నన్ను కలుసుకున్నప్పుడుగానీ ఈ పాయింట్ తోచలేదు. అచ్యుతరావ్, ఆర్కిటెక్ట్. మార్గ

రెట్ అతని దగ్గరే పనిచేస్తోంది. అతనిదంతా సీక్రెట్ వ్యవహారం. తిరిగి వచ్చాక వివరిస్తాను....

"అయితే జాన్, నిన్నరాత్రి అతనింట్లో ఒక దొంగ ప్రవేశించాడట. సేఫ్‌నుంచి అతని రహస్యప్లాను ఒకటి, లేక అన్నీ కాజేసే ప్రయత్నం చేశాడట. కాని అది ఫలించలేదనుకో....ఆ దొంగ గురించి రావ్ చెపుతుంటే లావుగా, పొట్టిగా వుండే గోయెల్ నా కళ్ళముందు మెదలసాగాడు. వెంటనే రావ్‌ని వదిలించుకొని కృష్ణన్ దగ్గరి కెళ్ళాను. ఎందుకు తెలుసా? హత్యాయుధం ఏదో తేల్చుకోడానికి!"

జాన్ తల విదిలించాడు—

"పార్ట్‌నర్, నా మాటలు తికమక పరుస్తున్నాయా? తికమక యేమీ లేదు విను! అసలు హత్యాయుధం గురించి మనం పూర్తిగా పొరపాటు అభిప్రాయంతో వున్నాం. వివేక్‌మీద హత్య అల్లబడిందని మనకు తెలుసు. ఇప్పుడు అతనిమీద హత్యను బనాయించాలనుకున్న అసలు హంతకుడి మోటివ్ ఏమిటో సంగ్రహంగా చెప్తాను, శ్రద్ధగా విను.

"మొదట, హంతకుడు వివేక్‌ని ఇరికించాలనుకున్నప్పుడు హత్యాయుధం రివాల్వర్ని శవంతోబాటు ఎందుకు వుంచలేదు? అదింకా సహజంగా—ఎలా చెప్పాలి నీకు-కన్విన్సివ్‌గా వుంటుందికదా? సరే, అలా చేయడం అప్పుడు మర్చిపోయి తర్వాత ఎక్కడో ప్లాంట్ చేశాడనుకుందాం, ఆ యెక్కడో యెక్కడయి వుండాలి? వివేక్ స్కూటర్లోనో. లేక వాళ్ళింట్లోనో కావాలి. అదీ ఇదీ కాకపోతే హత్యా స్థలంలోనే పారెయ్యాలి. అంతేనా?

"కాని హంతకుడు ఇన్ని చోట్లలో యెక్కడా ప్లాంట్ చేయలేదు. సులభంగా దొరికిపోయే చోటు వదిలి, యెక్కడో ఊహాకందని చోట దాచి, వివేక్ మీద హత్యాభియోగాన్ని నాన్చడుక దా? కేసుని కుంటుపర్చడు కదా? సత్వరం రుజువై పోయి శిక్ష పడేలా చూస్తాడు. అప్పుడే అతడికి రిలీఫ్. కాని ఇంతవరకు మనకు రివాల్వర్ లభించలేదు. ఎందుకు లభించలేదు? పార్టనర్, ఇక్కడే వుంది పాయింట్. ఎందుకు లభించలేదంటే హంతకుడు మనం ఆశిస్తున్నట్లు చెయ్య లేదు. వివేక్ మీద ఆ రివాల్వర్ ని ప్లాంట్ చేసే ఉద్దేశం అతనికి లేదు. ఎందుకని? ఆ రివాల్వర్ హత్యాయుధం కాదు గనుక!"

జాన్ కలవరపడ్డాడు—

"....అంతే జాన్! ఇంతకంటే యెక్స్ప్లనేషన్ తోచడంలేదు దీనికి! హంతకుడి దృక్కోణం నుంచి చూస్తే ఇదే సంభవమనిపిస్తోంది....అది హత్యాయుధం కానప్పుడు హంతకుడు దాన్నెక్కడా ప్లాంట్ చెయ్యడు. పారెయ్యడు. నాశనం కూడా చెయ్యడు. అలా చేసి నిశ్చింతగా వుండలేడు! మరి ఏం చేస్తాడు? సింపుల్. తన ఆధీనంలోనే ఉంచుకుంటాడు... తన్నెవరూ అనుమానించరు కాబట్టి. ఏమంటావ్?

"రెండు రివాల్వర్స్ ఒకే తయారీ, ఒకే మోడలు, ఒకే క్యాలిబర్ మొదలయిన భౌతిక లక్షణాలను కలిగి వుండవచ్చు. కానీ అందులో ఉపయోగించే అమ్యూనిషన్-బుల్లెట్స్ ఒకేరకం అయివుండాలని లేదు. అంటే వాటి ఆకృతి—క్యాలిబర్ కాదు. ఒకే క్యాలిబర్ లో రివాల్వర్ బుల్లెట్స్ వివిధ ఆకృతుల్లో లభిస్తాయి. మొనదేలి వున్నవి గుండ్రటి తాలం గలవి....

"వెల్, బాలస్టిక్స్ రిపోర్టునిబట్టి హత్యాయుధం .38 కోల్టు. వివేక్ (తండ్రి) రివాల్వర్ కూడా .38 కోల్టు. హత్యాయుధం అది కాదని అనుమానించాను గనుక అప్పుడు హంతకుడి రివాల్వర్ కూడా అదే మోడలు .38 కోల్టు అయితీరాలి. ఇలా రెండు రివాల్వర్స్ ఒకటే కావటం కేవలం కాకతాళీయం. ఇది కాకతాళీయం అయినంతమాత్రాన, ఆ రెండు రివాల్వర్స్‌లో ఉపయోగించే అమ్యూనిషన్—బుల్లెట్స్ కూడా ఒకే రూపం కలిగి వుండాలని నియమం వుందా? లేదు.

అందుకే కృష్ణన్ దగ్గిరికెళ్ళి హతమార్చిన బుల్లెట్‌ని చూశాను. హంతకుడి రివాల్వర్ నుంచి వెలువడిందని నేననుకొన్న సోకాల్డు బుల్లెట్ గుండ్రటి తలం గలది. ఆ వెంటనే వివేక్ తండ్రి దగ్గరకెళ్ళి అమ్యూనిషన్ చూపించమన్నాను. ఆయన బాక్స్ తెచ్చి బుల్లెట్స్ చూపించాడు. హూల్డాన్! వివేక్ మీద ఇంకెక్కడి కేసు, పార్ట్‌నర్! అవి మొనదేలిన బుల్లెట్స్ అఫ్‌కోర్స్...."

జాన్ వులిక్కిపడ్డాడు.

"యువర్ లాజిక్ ఈజ్ మ్యాజిక్ లాల్!" అనర్చాడు.

"....అఫ్‌కోర్స్, బుల్లెట్ ఆకృతిని బట్టి హత్యాయుధాన్ని నిర్ణయించలేం. వివేక్ రివాల్వర్ హత్యకుపయోగించబడలేదని అప్పుడే చెప్పలేం: అది లభించి విశ్లేషింపబడేవరకూ. కాని, ఇప్పటి పరిస్థితినిబట్టి, బయటపడ్డ సంగతుల్నిబట్టి, వివేక్ రివాల్వర్‌తో హత్య జరగలేదని నిర్ణయానికొస్తున్నాను, జాన్. నాకిపుడు గోయెల్ ఆత్మకథ మనోఃఫలకంమీద స్పష్టంగా కనిపిస్తోంది....ఏమిటది?

"గోయెల్ రావు దగ్గర ప్లానుకోసం పథకం వేశాడు. అప్పటికి ప్లాను ఇంకా పూర్తికాలేదు. మొన్న పూర్త

యించని రావ్ నాతో తర్వాత అన్నాడు. ఆ ప్లాను పూర్తయితే క్లయింట్ కందించవచ్చు, లేదా తాత్కాలి కంగా సేఫ్‌లో భద్రపర్చవచ్చు. సేఫ్ కాంబినేషన్ గోయెల్‌కు తెలియదు. కానీ మార్గరెట్‌కు తెలుసు; రావ్ చెప్పాడు.

"అందువల్ల గోయెల్ మార్గరెట్‌ని లక్ష్యంచేసుకొని రంగంలో దిగాడు. ఆమెని బ్లాక్‌మెయిల్ చేశాడు. ఎటువంటి బ్లాక్‌మెయిల్‌కామె లొంగుతుంది? అది గోయెల్‌కు తెలుసు. రావ్ మార్గరెట్ మీద తీవ్రమైన ఆంక్షలు విధించాడు. ఆమె ఉద్యోగం గురించి ఎవరికీ చెప్పకూడదు, ఎవరితోనూ స్నేహం చేయకూడదు, అలా జరిగితే ఆమె ఉద్యోగం పోవడమేగాక, కఠినంగా శిక్షించగలనని రావ్ హెచ్చరించాడు.

"అయినా ఆమె నిర్లక్ష్యంచేసి, అతని కళ్ళుగప్పి వివేక్‌తో స్నేహంచేసింది. ఈ పట్టు చాలనుకున్నాడు గోయెల్. వాళ్ళిద్దర్నీ రహస్యంగా కనిపెడ్తూ వివేక్‌తో ఆమెని జంటగా ఫోటో తీశాడు. అవును అలాగే చేసి వుండాలి. ఫోటోలతోనే బ్లాక్‌మెయిల్ చేశాడు. లేకపోతే హత్యజరిగిన రాత్రి ఆమె ఇంట్లో సోదాజరిపే అవసరం దేనికి? ఆ ఆధారాలు తొలగించడానికి, మనకు బ్లాక్‌మెయిల్ ఆంగిల్ తోచకుండా వుండడానికి.

"ఆ శ్రమ ఎందుకు? వివేక్ ఆమెతో పెనుగులాడిన చోటే శవాన్ని పడేసి వెళ్తే సహజంగా ఉంటుంది కదా? పార్ట్‌నర్, అలా చేస్తే హత్య వెంటనే బయట పడ్తుంది. రావ్ దగ్గర ప్లానుకోసం ప్రయత్నాలు ఫలించవు. అంతటితో చక్కాపెట్టాలి. హత్య బయటపడితే రావ్ ఎలర్టు అవుతాడు, జాగ్రత్తపడ్తాడు.

"కాబట్టి ప్లాను చిక్కేవరకూ హత్య బయటపడకూడదనుకున్నాడు. అందుకే శవం పూడ్చబడింది. అప్పుడు మహేష్ ఇంకా తెలివిగా ఆలోచించాడు; ముందు చూపుతో వివేక్ ఆమెతో ఘర్షణ సంగతి అప్పుడు పేలిన రివాల్వర్ సంగతీ దాచవచ్చుగానీ; సాయంత్రం షూటింగ్ నేర్పిన విషయం దాచలేడు. పాట్స్ చుట్టుప్రక్కల ఎవరైనా వినివుంటారు. కాబట్టి ఆమె తల మీద ఆ పిల్స్ వుంచి తమాషా చేసినట్టు చెప్పి తీర్తాడు గొప్పకోసమైనా. సరిగ్గా అక్కడే మహేష్ అతన్ని దెబ్బతీయాలనుకున్నాడు. అంతే, అక్కడ ముక్కలైన రెండు ఆపిల్స్‌లో ఒకటి తొలగించి, తను తెచ్చిన పూర్తి పండు ప్లాంట్ చేశాడు.

"దట్సాల్, జాన్—మహేష్ అక్కడ్నుంచి వెళ్ళిపోయి బాస్‌ని కలుసుకున్నాడు. మార్గరెట్ మీద దౌర్జన్యం జరిగిన చిహ్నాలుంటే అవి ఆమె చనిపోయాక శవాన్ని హాండిల్ చెయ్యడంలో మోటుతనంవల్ల కావచ్చు. మహేష్ తోటలో బావిదగ్గర శుభ్రంగా ముస్తాబై గోయెల్ దగ్గిరి కెళ్ళాడు. గోయెల్ పారిపొమ్మన్నాడు—కొన్నాళ్ళపాటు.

జాన్ నిట్టూర్చాడు. మళ్ళీ చెవులు రిక్కించి విన్నాడు.

"....కాబట్టి జాన్, నువ్వా హంతకుడ్ని పట్టడానికిదే అనువు! తక్షణం గోయెల్ ఇంటికెళ్ళు. నా వూహ నిజమైతే ఆ ప్లానుదొంగ అతనే అవుతాడు. మార్గరెట్‌ని చంపుకోవడంలో నిన్నరాత్రి గత్యంతరం లేక, ఆరాటం అణచుకోలేక, తెగించి రావ్ ఇంటికెళ్ళాడు. ఫలించలేదు. అయినా ఈ రాత్రికూడా ప్రయత్నిస్తాడని నా

నమ్మకం. అయితే, ఈసారి జాగ్రత్తగా, ఆయుధం పట్టుకొని వెళ్ళాడు. ప్లాసు దొంగ గోయెల్ అనడానికి ఆధారమేమీ లేదు, కేవలం నా అనుమానం తప్ప. లావుగా, పొట్టిగా ఎందరో వుంటారు.

"దొంగ గోయెల్ అవునో కాదో తేలడానికి ఒక, బఫూన్ ట్రిక్ చేశాను. రావ్ కో చూయింగ్ గమ్ ఇచ్చి ఇంటికి నములుతూ వెళ్ళి సేఫ్ ముందు వుమ్మేయమన్నాను. సేఫ్ ఖాళీ చేసి వెంటనే ఏ హోటల్ కైనా వెళ్ళిపోయి వుండమన్నాను. అతనిందాక అలాగే చేశానని కంపాలా నుంచి ఫోన్ చేశాడు. నువ్వు వచ్చేపాటికి ఆ దొంగ రావ్ ఇంటికి వెళ్ళివుంటాడు. ఈరాత్రి తప్పక దొంగ తిరిగి వస్తాడని నమ్ముతున్నాను.

"నువ్వెంటనే గోయెల్ ఇంటికెళ్ళి రహస్యంగా అతని చెప్పులుంటే చెప్పులు, లేదా బూట్లకి అడుగున నా బఫూన్ ట్రిక్ పనిచేసిందేమో—చూయింగ్ గమ్ అంటుకుందేమో చూడు. ఉంటే అతనే దొంగ—హంతకుడు వగైరా.

"మళ్ళీ ఇక్కడ మెటీరియల్ ఎవిడెన్స్ సమస్య వుంది—హత్య విషయంలో. కనుక వివేక్ రివాల్వర్ తో పాటు హంతకుడి రివాల్వర్ కూడా దొరకాలి. గోయెల్ ఆ రెంటినీ ఇంట్లో వుంచడు, ఎక్కడో దాస్తాడు. తను ఇప్పుడు అనుమానితుడని అతనికి తెలుసు. ఏ క్షణంలో నైనా పోలీసులు సెర్చివారెంట్ తో వస్తే ప్రమాదం. అందుకని వాటిని మాయం చేస్తాడు.

"మార్గరెట్ ని ఇంటికి పిలిచి ఆ ఫోటోలు చూపి బెదిరించి వుంటాడు: పరిస్థితి తెలుసుకుని ఆమె భయపడి పోయింది, చలించిపోయింది. అయినా వివేక్ తో తిరుగుళ్లు

మానలేదు. కాని అతడికేమీ చెప్పలేదు. ఒకరోజు వివేక్ తన తండ్రిదగ్గర రివాల్వర్ ప్రసక్తి తెచ్చాడు. అప్పుడే ఆమెకో ఆలోచన స్ఫురించింది—తనుకూ షూటింగ్ నేర్పమని పట్టుబట్టింది.

"నిజంగా నేర్చుకోవాలన్న కుతూహలంతో కాదు, ఒక్కసారి ఆ రివాల్వర్ తనకు చిక్కితే దాంతో గోయెల్ పీడ తొలగించాలనుకుంది బ్లడీఫూల్. వెల్ అలాగే జరగబోయింది....నిన్నరాత్రి వివేక్‌ని గాయపర్చి రివాల్వర్‌తో పారిపోయింది. అప్పుడు మహేష్ తోట లోనే ఉండి గమనిస్తున్నాడని మరువకు! వాళ్ళిద్దరి కద లికల్ని అతను కనిపెడ్తున్నాడు. తోటలో వాళ్ళు చేసిందంతా చూశాడు. చీకటిపడ్డాక వారిద్దమధ్య ఘర్షణ జరగడం-రివాల్వర్‌కోసం-అప్పుడది ప్రేలడం, ఆమె పారిపోవడమూ చూసి, వివేక్‌ని సమీపించాడు. అతను తెలివితప్పి పడివున్నాడు. అప్పుడు రివాల్వర్‌కోసం వెదకి; అది లేకపోవడంతో దాంతో ఆమె పారి పోయిందని వెంటనే మోటార్‌సైకిల్ ఎక్కి వెంబ డించాడు.

"మార్గరెట్ అతన్ని పసిగట్టి ఎక్కడెక్కడో ఆటోని తిప్పి, చివరకి అబిడ్స్‌లో వదిలించుకుంది. అక్క డామె తప్పిపోవడంతో ఆ తర్వాత ఎక్కడికి వెళ్తుందో ఊహించిన మహేష్, వెంటనే అబిడ్స్‌నుంచి బాస్‌కి ఫోన్ చేసి హెచ్చరించాడు; మార్గరెట్ రివా ల్వర్‌తో వస్తున్నట్టు.

"అప్పుడు గోయెల్ ఇంట్లో కుక్కల్ని రప్పించుకొని ఆమె రాకను సులువుచేశాడు. ఆమెని చంపే ఉద్దేశ్యం అప్పుడసలు లేదతనికి! ఆమెవల్ల ప్రయోజనం పొంద

బోతున్నాడు. కానీ ఆమె వెళ్ళీ వెళ్ళడంతోనే కసితో రివాల్వర్ తీసి అతనిమీద కాల్చివుంటుంది—చీకిటిలో అతడు తప్పించుకొని బైటపడ్డాడు. ఆమె అంతకు తెగిస్తుందని ఊహించనందువల్ల కంగుతిని ఆ కంగారులో అప్రయత్నంగా షూట్ చేసి వుంటాడు-తన రివాల్వర్తో ఆమెని. అంతే, ఇంతకంటే మరోలా జరిగిందనిపించడం లేదు....ఆమె చనిపోయింది.

"ఆ క్షణంలో మహేష్ అక్కడ చేరుకున్నాడు. జరిగింది చూసి భయపడ్డా తర్వాత చురుగ్గా ఆలోచించాడు. వెంటనే ద్రాక్షతోటలో తను చూసింది వివరించి, తన అయిడియా బాస్కు చెప్పాడు. గోయెల్ సందేహించకుండా దాన్నంగీకరించాడు.....ఆ హత్య గురించి తప్పించుకోడానికి అంతకంటే మార్గం తోచ లేదు. మహేష్ మార్గరెట్ శవం బాస్ కార్లో వేసుకొని బయలుదేరాడు.

"అతను తోటకెళ్ళేటప్పటికి అక్కడ వివేక్ లేడు. సుమారు గంటక్రితం స్పృహవచ్చి మార్గరెట్ కోసం వెళ్ళిపోయాడు. మహేష్ మార్గరెట్ శవాన్ని అక్కడ పడేసి, ఆమె బాగులో తాళంచెవితో బయలుదేరాడు. అప్పుడే-తొమ్మిదిన్నరకి—తోటప్రక్కన పొల్లోవాళ్ళకి మూడు పాట్సు వరుసగా వెన్వెంటనే విన్పించాయి. కానీ అవి రివాల్వర్ పాట్సుకావు.

"జాన్, సాయంత్రం వాళ్ళు రివాల్వర్ పాట్సు విని వుండటంవల్ల రాత్రి విన్పించిన పాట్సుకూడా అవే నను కున్నారు. కానీ ఆ మూడూ రివాల్వర్ పాట్సుకావు. కారు బ్యాక్ ఫైర్ మోత! గోయెల్ కారు పాతడార్జి. మహేష్ మార్గరెట్ ఇంటికి వెళ్ళేందుకు స్టార్టుచేసినపుడు

సహజంగానే బ్యాక్ ఫైర్ చేసింది. పోల్ట్రీవాళ్ళు దాన్ని రివాల్వర్ పాట్సుగా పొరబడ్డారు.

"వెల్. మహేష్ ఆమె ఇంటికెళ్ళి అక్కడ బ్లాక్ మెయి లాధారాలు - ఫోటోలు - తొలగించి వచ్చాడు. అప్పుడు గొయ్యితీసి శవాన్ని పాతిపెట్టాడు. రివాల్వర్ అయితే లైసెన్స్ ఉండదు. అతని దగ్గర రివాల్వర్ ఉందని పోలీసులు ఆరోపించలేరు. కనుక, అప్పుడు దాన్ని చూపమనీ అడగలేరు! గోయెల్ వాటిని ఇంట్లోనే ఎక్కడో మట్టుబెడ్తాడు, లేక బావిలో పడేస్తాడు.

"నువ్వు వాటిని కనుక్కొని గోయెల్ రివాల్వర్లో చూడు! గుండ్రటి తలంగల గుళ్ళుండాలి.... అలాగే వివేక్ రివాల్వర్లో మొనదేలిన తలంగల బుల్లెట్స్ వుండాలి. అంతేగాక, వివేక్ రివాల్వర్లో ఒక్కటే బుల్లెట్ వుండాలి. ఎందుకంటే, ముందు వివేక్ చెప్పినదాన్నిబట్టి మూడు బుల్లెట్స్లో ఒకటి ఆమెతో పెనుగులాటలో ప్రేలింది; మరొకటి మార్గరెట్ గోయెల్ మీద కాల్చినప్పుడు—మూడింట్లో ఈ రెండు పోతే ఒకటి మిగుల్తుంది. వివేక్ రివాల్వర్ని గుర్తించడానికి నెంబర్ చెప్తున్నాను వ్రాసుకో...."

జాన్ గబగబా వ్రాసుకున్నాడు.

లాల్ కంఠం మళ్ళీ అంది. "దట్సాల్ జాన్. నువ్వా రెండు రివాల్వర్స్ని కృష్ణన్ కందిస్తే కేసు నమ్మకంగా తేలిపోతుంది—టెస్టు బుల్లెట్ పరీక్షలో. నువ్వెంటనే గోయెల్ ఇంటికెళ్ళు. చెప్పినట్టు చెయ్యి.... నా వూహ నిజం కావాలి! వివేక్ క్షేమంగా బైటపడాలి! మరో విషయం.... అక్కడ కుక్కలున్నాయి జాగ్రత్త. నువ్వీ పని చేసి ఏ విషయం రేపు వుదయం నాకు ఫోన్ చెయ్.

ఏడు గంటలకి. ఒబెరాయ్ టవర్స్‌కి. ఉంటాను. గుడ్ లక్. యువర్ లాల్."

## 9

వీధి మలుపులో కారాపేసి దిగాడు జాన్.

అక్కడంతా నిశ్శబ్దంగా, నిర్జనంగా వుంది. దైము ఒకటిన్నర కావస్తోంది. సిగరెట్ విసిరేసి కారు దిగాడు. ఓసారి ఇరువైపులా చూసి, పొట్లం అందుకున్నాడు. దానితో నడక సాగించాడు.

మూడు నిమిషాల్లో గోయెల్ ఇంటిముందు చేరుకున్నాడు. లోపల కారు కన్పించింది. ఇంట్లో లైట్లు లేవు, పైన ఒక గదిలో మసక వెలుతురు తప్ప. బయట అంతా చీకటిగా వుంది. చంద్రుడు లేడు. ఆవరణలో తిరుగుతున్న కుక్కలు కన్పించలేదు....ప్రహారీ గోడ నానుకొని కళ్ళు చీల్చి చూడసాగాడు. ఇంతలో వీధిలో ఒక కారు అతన్ని దాటిపోయింది. దాన్ని ముందే గమనించిన జాన్, అక్కడ్నుంచి చటుక్కున కదిలి వేగంగా నడిచాడు. అది దాటిపోయాక వెనుదిరిగి వచ్చాడు, కాంపౌండ్‌లో తీక్షణంగా చూస్తూ.

అప్పుడు కన్పించిందొక జంతువు కుడివైపునించి వస్తూ. జాన్ వెంటనే పొట్లం విప్పి బ్రెడ్ ముక్క అందుకున్నాడు. దాన్ని కాంపౌండ్‌లోకి విసిరాడు సరిగ్గా ఆ కుక్కముందు పడేలా. అలాగే మరో ముక్క విసిరాడు. అది చటుక్కున తలవంచి నేలను తడిమింది. ఏదో స్పర్శ తగిలి దాన్ని నోటితో కరిచిపట్టుకుంది. రుచి పసిగట్టి చకచకా నమిలి మింగేసింది. కళ్ళు మూతపడి మత్తుగా సోలిపోయింది.

జాన్ టార్చివేసి చూసి తృప్తిపడ్డాడు. మరో కుక్క

కోసం నిరీక్షించాడు. రెండు నిమిషాలయ్యాక రెండో కుక్క కూడా అలాగే వచ్చి నేస్తంలాగే సోలిపోయింది.

జాన్ టార్చివేసి చూశాడు. తేలిగ్గా నిట్టూరుస్తూ గోడ దూకాడు.

వేగంగా పరుగెత్తి కారు దగ్గరకెళ్ళాడు. బానెట్ తెరిచి ఇంజన్ ముట్టుకొని చూశాడు. కొద్దిగా వేడిగా వుంది....తలూపి ఇంటికేసి నడిచాడు.

తలుపులు, కిటికీలు పరీక్షిస్తూ అవి అభేద్యంగా తోచడంతో, ఇంటి వెనుకవైపు పట్టుకొని మేడమీద బాల్కనీలోకి దూకాడు. అలికిడిగాకుండా నడిచి ఒక కిటికీ దగ్గర ఆగాడు—అద్దంలోంచి మసగ్గా వెలుగు వస్తోంది. అది స్క్రీన్ గ్లాస్ కావడంతో లోపల ఏం కన్పించలేదు.

అక్కడనుంచి కదిలి ప్రక్క కిటికీ దగ్గరాగాడు. ఆ గది చీకటిగా వుంది. ఆలాగే ఆ అవతలి గది కూడా చీకటిగా వుంది. పిడికిలితో దాని అద్దం పొడిచేయ బోయాడు. కానీ తమాయించుకొని, జాగ్రత్తపడి, అసహనంగా సిగరెట్ వెలిగించి పీలుస్తూ గడిపాడు కొన్ని క్షణాలు.

ఆ కొన్ని క్షణాలయ్యాక ఒక ఆలోచనవచ్చి క్రిందికి దిగి వచ్చాడు. టార్చివేస్తూ వేగంగా తోటలో తిరిగాడు. ఎక్కడా తవ్విన గుర్తులేవు.... బావి దగ్గరకొచ్చి లోన టార్చివేశాడు. నీళ్ళు పుష్కలంగా వున్నాయి. అడుగు కన్పించడంలేదు. బావిలోకి ఒక వైపు బిగించివుంది. దాన్ని చూసి వెంటనే తలతిప్పి చుట్టూ చూశాడు. గబుక్కున ఆ వైపు దగ్గరికెళ్ళిన అతనికి బావి ప్రక్కన పంపింగ్ మోటార్ కన్పించింది.

వెంటనే అక్కడ్నుంచి వురికాడు. వరండా ప్రక్కన గోడవారగా పైకి రెండు పైపులు వెళ్తున్నాయి.... వాటిని చూసి వేగంగా ఇంటి ఎడమవైపు కురికి డ్రైనేజీ పైపు సహాయంతో పైన డాబా చేరుకున్నాడు.

అక్కడ నీళ్ళ టాంకు అమర్చివుంది.

దానిమీ దెక్కి మూత లాగేశాడు.

నాలుగడుగుల లోతువుంది. నీరు సగానికి పైగావుంది. ఆ నీట్లోంచి అడుగున టార్చి వెలుగులో స్పష్టంగా కనిపిం చాయి— రెండు రివాల్వర్స్.

తటాలున చెయ్యిపోనిచ్చి హాటిని అందుకొన్నాడు. క్రిందకు దిగి ఆత్రుతగా వాటిని షర్టుకి తుడిచాడు. అలా తుడవడంలో ఒక రివాల్వర్ జారి కిందపడింది. ఖంగుమని శబ్దమైంది—

తిరిగి అందుకుని తుడిచాడు. ఆ రెండు రివాల్వర్స్ ఒకేలాగున్నాయి. జేబులోంచి చీటీతీసి అందులో నెంబర్‌తో వివేక్ రివాల్వర్‌ని గుర్తించాడు. సిలిండర్ తెరిచి అందులో టార్చివేశాడు. ఒకేఒక్క బుల్లెట్ కనిపించింది. మొనదేలిన బుల్లెట్.

సంతోషం పట్టలేక రెండో రివాల్వర్ తెరిచాడు. మూడు బుల్లెట్స్ వున్నాయి. గుండ్రటితలంగల బుల్లెట్స్!

బ్రదర్! నువ్వు పూర్వజన్మలో జ్యోతిష్కుడివా!

"ఎ—ఎవరది? ఎవరక్కడ?"

జాన్ కొయ్యబారిపోయాడు. కదిలేందుకు కాళ్ళు చేతులు సహకరించలేదు. వెనుక అడుగుల చప్పుడైంది.

"ఎవర్నువ్వు? ఏం చేస్తున్నావిక్కడ?"

మళ్ళీ వినిపించింది గొంతు, ఈసారి కర్కశంగా.

అప్పుడు తేరుకొని ఆ కంఠం గుర్తించాడు జాన్.

గుండెల నిండుగా గాలి పీల్చాడు.

"దిసీజ్ మిస్టర్ జాన్ ఫ్రం ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీ!"

విసురుగా తిరిగి ఫెడీమని కొట్టాడు ఆ ఆకారం మొఖంమీద.

గోయెల్ ధబీమని క్రిందపడి, దొర్లుకొంటూ వెళ్ళి పిట్టగోడకి కొట్టుకున్నాడు—నన్నింక కొట్టకు అనర్చి మరింక క్షణం కూడా వృథా చెయ్యడం మనసొప్పక మూర్ఛపోయాడు.

జాన్ ఆశ్చర్యంగా చూసి, అతన్ని సమీపించాడు.

కాళ్ళ దగ్గర కూర్చొని టార్చివేశాడు. కుడి కాలి చెప్పు అడుగున తెల్లటి పదార్థంచూసి, దాన్ని పట్టి లాగాడు. అది తారులా సాగుతూ వచ్చింది.

దాన్నింకా లాగుతూ, అప్రయత్నంగా ప్రక్కన చూశాడు.

అక్కడ కాలిన బూడిద కుప్పగా కనిపించింది.

దాన్ని కెలికి, అందులోంచి ఇంకా పూర్తిగా కాలని నెగెటివ్ ఫిల్మ్ముక్క తీశాడు.

దాన్ని వెనకనుంచి టార్చి ఫోకస్ చేసి చూశాడు. వివేక్ మార్గరెట్ల మొఖాలు మాత్రం నవ్వుతూ వెలిగాయి.

—: ఐపోయింది :—

# చెల్లెలు పెళ్లి

## టెంపోరావ్

రాత్రి తొమ్మిది దాటింది. బలరామ్ ఇరానీ రెస్టారెంట్‌లో కూర్చుని టీ సేవిస్తున్నాడు. నల్లటి ప్లాస్టిక్ బాగ్ అతని ఒళ్ళో వుంది. టీ తాగడం ముగించి అతడు చార్మినార్ సిగరెట్ వెలిగించాడు. పొగ వదులుతూ నలువైపులా చూశాడు. అతడికన్ని వైపులా అనేకమంది కూర్చుని వున్నారు. అతని కెదురుగా వున్న టేబుల్ కటువైపున వున్న రెండు కుర్చీలు ఖాళీగా వున్నాయి.

టెలిఫోన్‌లో తనతో చెప్పినదంతా అతడికి జ్ఞాపకొస్తోంది. తొమ్మిదింటికి తను ఇరానీ రెస్టారెంటులో కూర్చుని టీ తాగుతూ వుండాలి. ఎవరో వచ్చి, "హాలో, మిస్టర్ బలరామ్!" అంటారు. ఆ మనిషి కూడా అతడు వెళ్ళాలి.

తనని కలుసుకోవలసిన వ్యక్తి రెస్టారెంటులో వున్నాడా? దగ్గర కొచ్చిన హోటల్ బాయ్‌కి అతడు యాభై పైసలు చెల్లించాడు. పొగ వదులుతూ మౌనంగా

కూర్చున్నాడు. లోలోపల అతను గాభరాపడుతున్నాడు. చివరికి ఈ ప్రయత్నం ఏమవుతుందో? అన్నీ సవ్యంగా జరిగితే తన చెల్లెలు జానకి పెళ్ళి వెంటనే చేసెయ్య వచ్చు. బూట్ల చప్పుడు విని బలరామ్ తన ఆలోచన ల్లోంచి త్రుళ్ళిపడ్డాడు. పొడుగ్గా, సన్నగా సూట్లో వున్న ఒకతను టేబులువైపు వస్తున్నాడు. కాస్సేపట్లో ఆ వ్యక్తి టేబులు దగ్గరగా వచ్చాడు.

"హలో, మిస్టర్ బలరామ్!" అన్నాడతను చెయ్యి చాచుతూ.

అమాంతంగా కుర్చీలోంచి లేచి బలరామ్ అతడితో కరచాలనం చేశాడు. ఆ వ్యక్తి గబగబా బయటకు నడి చాడు. వెనకనే వేగంగా అడుగులేశాడు బలరామ్.

రోడ్డు దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. పేవ్ మెంట్ల మీద జనం ఎక్కువగా లేరు. పేవ్ మెంటు వారగా ఒక అంబాసిడర్ కారు ఆగి వుంది. ఆ వ్యక్తి గబగబా కారువైపు వెళ్ళాడు. వెనక తలుపు తెరిచాడు. బలరామ్ కారు వెనుకనున్న నంబరువైపు చూశాడు. ఇటువంటి పరిస్థితుల్లో కారు నంబరు గుర్తుంచుకోడం మంచిది.

బలరామ్ కార్లో ఎక్కి కూర్చున్నాడు. సూటు ధరించిన వ్యక్తి పక్కనే కూర్చుని తలుపు మూశాడు. స్టీరింగ్ వీలు వెనుక కూర్చున్నతను కారు వేగంగా పోనిచ్చాడు.

కారు స్పీడుగా సాగిపోతోంది. కొన్ని నిముషాల పాటు కారులో నిశ్శబ్దంగా వుంది. బలరామ్ గుండె దడదడ కొట్టుకుంటోంది. అతని మెదడులో ఆలోచనలు పరుగెడుతున్నాయి. నూరు అబద్ధాలు చెప్పయినా పెళ్ళి

చెయ్యడం మంచిదన్నారు పెద్దలు. చెల్లెలు పెళ్ళికోసం తనీ కారులో తెగించి ప్రయాణం చేస్తున్నాడు!

"ఇంకా ఎంతదూరం వెళ్ళాలి?" అడిగాడు బలరామ్ నిశ్శబ్దాన్ని భరించలేక.

"వచ్చేస్తున్నాం" అన్నాడు పక్క కూర్చున్న వ్యక్తి.

కారు వేగంగా యింకా వెళ్తూనే వుంది. బలరామ్ ధైర్యాన్ని తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. వాళ్ళు మోసగాళ్ళు అయివుండరు. కారు ఎటు వెళుతున్నదీ తను చూడగలుగుతున్నాడు. ఏదేనా ప్రమాదం సంభవిస్తే కారు నంబరు, తను ఎక్కడికి వెళ్ళిందీ పోలీసులకి చెప్పొచ్చు. తటాలున ఒక కాంపౌండ్‌లోకి కారు ప్రవేశించింది. పెద్ద కాంపౌండు. ఎత్తయిన ప్రహారీగోడ. ఇనపగేటును బలరామ్ గుర్తుపెట్టుకున్నాడు. కారు ఒక మేడముందు ఆగింది.

తలుపు తెరిచి సూటు వ్యక్తి కిందకు దిగాడు. బలరామ్‌ని దిగమన్నాడు. ఇద్దరూ ముందు వరండావైపు వెళ్ళారు. విశాలమైన హాల్లోకి ప్రవేశించారు.

హాలు కుడివైపున ఏర్‌కండిషన్డ్ గది వుంది. తలుపును తోసి బలరామ్‌ని లోపలకు వెళ్ళమన్నాడతను. బలరామ్ లోపలకు వెళ్ళాడు. తలుపు వెనకనే మూసుకుపోయింది.

గదిలో ఫ్లోరసెంట్ ట్యూబులు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. ఎదురుగా గాడ్రెజ్ స్టీలు టేబులుకి అటువైపున కుషన్డ్ కుర్చీలో కూర్చున్న వ్యక్తి లేచి నుంచుని, "మిస్టర్ బలరామ్, వెల్కమ్ టు అవర్ ఆఫీస్" అన్నాడు.

బలరామ్ టేబులుదాకా వెళ్ళి అతడితో కరచాలనం

చేసి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

బలరామ్ క్షణకాలం ఎదురుగా వున్న వ్యక్తివైపు చూశాడు. ఎదుటి వ్యక్తి సూటులో వున్నాడు. నల్లటి గడ్డం, కళ్ళద్దాలు ధరించాడు. గిరజాల జుత్తు. అతడు నవ్వుతున్నాడు.

"మిస్టర్ బలరామ్, మా క్కావలసింది తెచ్చావా?"

"మీ పేరు?" అడిగాడు బలరామ్.

అతడు విచిత్రంగా నవ్వాడు.

"మిస్టర్ బలరామ్ నా పేరు తెలుసుకోడం వలన నీకే విధంగానూ లాభించదు. మనం మళ్ళా కలుసుకోం. పని పూర్తి అవగానే నీ తోవన నువ్వు వెళ్ళిపోతావు. జరిగిన దాన్ని గురించి ఎవ్వరూ ఎవరికీ చెప్పరు."

"ఈ కాగితం పట్టాడానికి నేను చాలా కష్టపడ వలసి వచ్చింది. ఫైల్లో అతి ముఖ్యమైన ఈ కాగితం లేదని తరవాత తెలుస్తుంది. మమ్మల్నందర్నీ అడుగు తారు. నా ఉద్యోగం ఊడొచ్చు"

"డోంట్ బాదర్. గవర్నమెంటు ఫైల్సులోనుంచి ఎన్నో కాగితాలిలా మాయమవుతున్నాయి. డిపార్ట మెంటు ఎంక్వయిరీ పెట్టిపోయిన కాగితాన్ని గురించి ప్రభుత్వం రెండు నెలల్లో మరచిపోతుంది."

"అయినా మీ రిస్తానన్న అయిదు వేలు చాలదు."

"ఎంత కావాలి?"

బలరామ్ క్షణకాలం ఆలోచిస్తూ ఉండిపోయాడు. అతని మెదడులో ఆశలు గూళ్ళు కట్టేస్తున్నాయి. చెల్లెలు పెళ్ళికి కనీసం పదివేలు ఖర్చవుతుంది. మరో పదివేలు చేతిలో వుంచుకోవడం మంచిది. మళ్ళా ఇటువంటి అవ కాశం తనకి రాకపోవచ్చు.

"నాకు ఇరవై వేలు కావాలి. నా చెల్లెలు పెళ్ళి వుంది. అందుకోసం అడుగుతున్నాను."

అతడు తియ్యగా నవ్వాడు.

"సంతోషం. ఒక మంచి కార్యానికి నేనిచ్చే డబ్బు వెళుతున్నందుకు ఆనందిస్తున్నాను. మిస్టర్ బలరామ్, మాతో సహకరిస్తూ మాకు కావలసినవాటిని పుట్టజెప్పే మిత్రులంటే నాకెంతో అభిమానం. నీ చెల్లెలు పెళ్ళికి రాలేను. ఆ సందర్భంలో ఆమెకు నా బహుమతిగా అయిదువేల రూపాయలు నువ్వు అందజెయ్యాలి. నీకు మొత్తం ఇరవై అయిదువేలిస్తాను."

అతడు టేబులు సొరుగును తటాలున లాగి అయిదు నోట్ల కట్టలను టేబులుమీద పడేశాడు.

"ఒక్కొక్క కట్టలో అయిదు వేలుంటాయి" అన్నాడతను నవ్వుతూ.

బలరామ్ ఆనందంగా ఆశ్చర్యంతో చూశాడు. ఇంత సులువుగా ఇంత పెద్దమొత్తం తన చేతికొస్తుందని అతడు అనుకోలేదు.

"చాలా థాంక్స్. ఈ జీవితంలో మిమ్మల్ని మరువను."

బలరామ్ బాగ్ తెరిచి ఒక పొడుగాటి కవర్ను టేబులుమీద వుంచాడు.

ఎదురుగా కూర్చున్న వ్యక్తి కవర్ను అందుకుని, లోపలున్న కాగితాన్ని పరీక్షించి, కవర్ను జాగ్రత్తగా టేబులు సొరుగులో పడేసి మూశాడు.

నోట్ల కట్టల్ని బాగ్‌లో పెట్టి బలరామ్ జిప్పర్ మూశాడు. తొందరగా తను యింటికి వెళ్ళాలి. గంతులేస్తూ ఈ నోట్ల కట్టల్ని తను తల్లికి, చెల్లికి, భార్యకు

చూపించాలి.

"మిస్టర్ బలరామ్! నువ్వెలా వెళ్తావు?"

"బస్సులో పోతాను."

"ఇంత డబ్బుతో బస్సులో వెళ్ళడం మంచిదికాదు. మా కారులో వెళ్ళి నీ ఇంటి సమీపంలో దిగిపో!"

"మళ్ళా మీకు థాంక్స్!" అన్నాడు బలరామ్.

ఎదురుగా కూర్చున్న వ్యక్తి బజ్జర్ నొక్కాడు. సూటు ధరించినతడు లోపలకు గబగబా వచ్చాడు.

"ఇతడిని మన కార్లో ఇంటికి తీసికెళ్లి అక్కడ వదిలి వచ్చెయ్యండి," అతను ఉత్తరువిచ్చాడు.

సూటు ధరించిన వ్యక్తి వెనకే బలరామ్ బయటకు నడిచాడు. ఇద్దరూ కారు వెనకసీటుమీద కూర్చున్నారు. డ్రయివర్ పక్కనే లావుగా వున్న మరొకతను కూర్చుని ఉన్నాడు. అతడి తలమీద వెంట్రుకలు లేవు. బోడి గుండు!

కారు గేటువైపు కదిలింది.

"మా యిల్లు తేనాంపేటలో వుంది," అన్నాడు బలరామ్.

పక్కనున్న వ్యక్తి మాట్లాడలేదు. సిగరెట్ వెలిగించి బయటకు చూశాడు. గేటుదాటి, కుడివైపు తిరిగి కారు స్పీడుగా పోసాగింది.

## 2

అతడు కుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు. ఏదో చేయి అతడి గడ్డాన్ని నిమిరింది. అతడు కళ్ళు తెరిచి చూశాడు. అందాలు కురిపించే లత నవ్వు మొహం అతడికి కనిపించింది.

"మైడియర్!" అన్నాడతను.

"బాస్ ఏమిటి అంతగా ఆలోచిస్తున్నావు?" అందామె.

"ఒకతడ్ని యింటికి పంపాను. సక్రమంగా చేరేడో లేదో!"

లత కిలకిల నవ్వింది.

"నువ్వు యింటికి పంపినవాళ్ళు చేరకుండా వుండడం అసంభవం!" అందామె.

అతడు కుర్చీలో తిరిగి ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"నామీద నీకు బాగా నమ్మకం వుందే!"

"నమ్మకం వుండబట్టే నీకింత దగ్గరయ్యాను." అంది లత.

ఆమె నడుమును చేతోచుట్టి తనవైపు లాక్కున్నాడతను. ఎర్రటి ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"లతా, లెటస్ సెలిబ్రేట్! గెట్ మి స్కాచ్!"

ఆమె సమీపంలో వున్న అలమారువైపు వెళ్ళింది. రెండు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోసి, ఐస్ క్యూబ్స్ వేసి సోడా కలిపి టేబులుమీద పెట్టింది. ఇద్దరూ ఛియర్స్ అంటూ గ్లాసుల్ని అందుకున్నారు. అతడి పక్కనున్న చిన్న కుర్చీలో ఆమె కూర్చుంది. ఇద్దరూ విస్కీ సేవిస్తున్నారు. నిముషాలు గడుస్తున్నాయి.

ఎవరో తలుపుని తట్టారు.

"కమిన్," అన్నాడతను.

సన్నగా పొడుగ్గా సూటులో వున్న వ్యక్తి గదిలో కొచ్చాడు. అతడి వెనక లావుగా వున్న బోడిగుండు కదుల్తున్నాడు. ఇద్దరూ టేబుల్ సమీపంలో ఆగారు.

"జిమ్, ఏమైంది?" అడిగాడు బాస్.

సన్నటి వ్యక్తి నవ్వుతూ టేబులుమీద నల్లటిప్లాస్టిక్

బాగ్‌ను వుంచాడు. జిప్పర్ తెరిచి బాస్ బాగ్‌ను పరీక్షించాడు. లోపల అయిదు నోట్లకట్టలున్నాయి. ఒక కట్టను బయటకుతీసి సన్నటి వ్యక్తివైపు నవ్వుతూ విసిరాడు. దాన్ని జిమ్ వుషారుగా పట్టుకున్నాడు.

"జిమ్, మీ ముగ్గురూ దాన్ని పంచుకోండి. గుడ్‌లక్! చెప్పవలసింది ఏదైనా వుందా?"

"నథింగ్ బాస్. అంతా అనుకున్న ప్రకారం జరిగింది."

బోడిగుండు వ్యక్తి చేతులు తిప్పుతూ బాస్‌వైపు చూశాడు.

"బాస్, ఇటువంటి పన్లు ఎన్నిచ్చినా నేను క్షణంలో ముగిస్తాను." అన్నాడతను.

"ఆల్‌రైట్, వెళ్ళండి," అన్నాడు బాస్ అధికార ధోరణిలో.

ఇద్దరూ బయటకు వెళ్ళిపోయారు. గ్లాసులో విస్కీని అతడు గడగడ తాగేశాడు. రిసీవరెత్తి ఒక నంబరు తిప్పాడు. అటువైపు ఎవరో రిసీవరెత్తారు.

"హలో, రంజిత్ షా స్పీకింగ్!"

"మిస్టర్ షా, నీ గురించి మినిస్టర్ ఫైల్లోవున్న ఆ పత్రం విలువ ఎంత?" అడిగాడతను.

"ఎవరు నువ్వు?"

"నా పేరు చెప్పినా నువ్వు తెలుసుకోలేవు. ఎవరో మిస్టరీమాన్ ఫోన్ చేశాడనుకో. నీకు కావల్సిన పత్రం నా దగ్గరుంది. దానికోసం ఎంతగానో ప్రయత్నిస్తున్నావని నాకు తెలుసు. అది నీకు కావలిస్తే మనం వ్యాపారం ముగించొచ్చు."

"హలో, ఆ కాగితం నాకొక లక్ష రూపాయలిచ్చి తీసుకుంటాను."

అతడు గంభీరంగా నవ్వాడు.

"ఆ కాగితం మళ్ళా మినిస్టర్ ఫైలుకి చేరుకుంటే నువ్వు ఏళ్ళతరబడి జైల్లో కూర్చోవాలి."

"మిస్టర్, నీ కెంత కావాలి?"

"నువ్వు ఇస్తానన్నదానికి అయిదురెట్లు."

"గుడ్ హెవెన్స్! ఆ కాగితం అంత విలువ చెయ్యదు."

"ఆల్ రైట్, దాన్ని మళ్ళా మినిస్టర్ ఫైల్లో పెట్టించేస్తాను. గుడ్ నైట్!"

"ప్లీజ్, ఆగు. డోంట్ డిస్కనెక్ట్." అరిచాడు షా ఖంగారుగా.

"మిస్టర్ షా, నేను వెంటనే ఒక పార్టీకి వెళ్ళాలి. నీతో మాట్లాడుతూ జాగారం చెయ్యలేను."

"మిస్టర్, నువ్వడిగినంతా యిస్తాను. ఎలా యివ్వాలి? ఎప్పుడు?"

"డబ్బు సిద్ధంగా వుందా?"

"వుంది."

"మిస్టర షా, ఇప్పుడు పదిన్నరయింది. సరిగ్గా పదకొండింటికి బీచ్‌లో గాంధీ విగ్రహాందగ్గర నిలబడు. అయిదు లక్షలు బాగ్‌లో వుంచు. నీ ముందు మా కారు ఆగుతుంది. మా మనిషి నీదగ్గర కొస్తాడు. వెంటనే అతనితో వెళ్ళి ఆ కారులో కూర్చో. మా వాళ్ళు నీకు ఒక కవరిస్తారు. అందులోని కాగితం సరైనదో కాదో చూసుకో. నువ్వు కాగితం పరిశీలించే సమయంలో మా మనిషి నీ నోట్లను తెచ్చి చూస్తాడు. అటుపైన నువ్వు కావల్సిన చోట దిగిపోవచ్చు. సరేనా?"

"అలాగే చేస్తాను. కాని ఒక్క మార్పు. నాకు

కనీసం నలభై నిముషాలు గడువు కావాలి. 11.15 కి నేను నువ్వు చెప్పిన ప్రదేశంలో వుంటాను."

"మిస్టర్ షా, దీన్ని గురించి పోలీసులకు, లేక డిటెక్టివ్ లకు ఏమాత్రం నువ్వు చెప్పినా ఆ కాగితం మినిస్టర్ ఫైల్లోకి వెళుతుంది. అటుపైన దాన్ని నువ్వు పొందే అవకాశం నీ జీవితంలో లభించదు."

"మిస్టర్, నో ఫియర్స్. నేను మూర్ఖుడ్నికాను."

"ఆల్ రైట్, గుడ్ నైట్," అని అతను రిసీవర్ని పెట్టేశాడు.

లత గ్లాసుల్లో మళ్లా విస్కీపోసి, సోడాకలిపి ఐసు ముక్కలు వేసింది. అతడు గ్లాసును అందుకున్నాడు.

"బాస్, మన యూరోప్ ప్రయాణం ఎప్పుడు?" అందామె నవ్వుతూ.

"లతా, తొందరపడకు. యూరప్ తో అమెరికా కూడా పర్యటించి వచ్చే అవకాశం నీకు కల్పిస్తాను." అన్నాడతను.

ఆమె సంతోషంగా అతనిమీదకు వాలిపోయింది.

## 3

గుమ్మం బయట నిలబడి సుమతి బయటకు చూస్తోంది. రోడ్డుదీపాలు వెలుగుతున్నాయి. ఇప్పుడంతగా జన సంచారం లేదు.

"సుమతీ, ఇంకా ఎంతసేపు అలా చూస్తూ వుంటావు? వాడు ఎప్పుడో వస్తాడు. నువ్వు భోజనంచేసి వాడికి పదార్థాలన్నీ మూతపెట్టు" అంది అత్త సుందరమ్మ.

సుమతి తలుపులు మూసి గడియలు బిగించింది. హాల్లో లైటు వెలుగుతోంది. ఎనిమిదింటికే భోజనం చేసి జానకి నేలమీద పక్కేసి నిద్రపోతోంది. కూతురుపక్కనే తన

బొంతమీద యిటూ అటూ సుందరమ్మ దొర్లుతోంది.

సుమతి కుడివైపున్న పడగ్గదిలోకి వెళ్ళలేదు. తన అత్తపక్కనే వేలమీద కూర్చుండిపోయింది.

"ఏందుకో బెంగగా వుందండి," అంది సుమతి.

"ఎందుకమ్మా బెంగ! ఇలా ఆలస్యంగా రావడం వాడికలవాటేగా?"

"అది కాదండి. ఇవాళ ఆఫీసునుంచి ఆయనింటి కొచ్చారు. ఎందుకో అదోలా వున్నారు. దేన్నిగురించో ఆయన తీవ్రంగా ఆలోచిస్తున్నారు. వెళ్ళేముందు పది లోపల వస్తానని నాతో అన్నారు. పదకొండు అయినా యింకా రాలేదు."

"అబ్బాయి మళ్ళా ఆఫీసుకి వెళ్ళలేదా?"

"ఆఫీసుకి వెళ్ళుంటే నేనంత బెంగపడేదాన్ని కాను. మరెక్కడికో వెళ్ళాలన్నారు. చెల్లెలి పెళ్ళి దీనిమీద ఆధారపడుతుందన్నారు. ఎవరేనా డబ్బిచ్చారేమో! ఆ డబ్బు పట్టుకుని యింత రాత్రివేళ వస్తూంటే ప్రమాదం రావొచ్చు," అంది సుమతి.

వెంటనే సుందరమ్మ లేచి కూర్చుంది.

"ఎక్కడికెళ్ళాడంటావు?"

"అదే తెలీదండీ!"

సుందరమ్మ, సుమతి కొంతసేపు మౌనంగా కూర్చుండి పోయారు. సుమతి ఎస్. ఎస్. ఎల్. సి. పాసయింది. పెళ్ళయి ఆరేళ్ళయినా ఆమెకింకా పిల్లలేరు. ఏదో ఆలోచన తట్టినట్టు సుందరమ్మ కూతుర్ని లేపింది. జానకి నిద్రమత్తుతో కళ్ళు తెరిచి వాళ్ళవైపు చూసింది.

"ఏమిటమ్మా, అప్పుడే లేపేశావు?" అంది ఆమె విసుగ్గా.

"అమ్మాయ్, నీకింకా నిద్రమత్తు పోలేదు. వెళ్ళి మొహం కడుక్కునిరా. నీతో మాట్లాడాలి" అంది సుందరమ్మ.

జానకి మెల్లిగా బాత్ రూంలోకి వెళ్ళి మొహం కడుక్కుని తిరిగివచ్చింది. తల్లికెదురుగా వదిన పక్కనే కూచుంది.

"ఏవిటమ్మా?"

"బలరామ్ అన్నయ్య ఇంకా యింటికి తిరిగిరాలేదు."

"అంతేనా? అమాత్రం దానికి గాభరా ఎందుకమ్మా?" అని జానకి టేబులు మీదున్న గడియారంవైపు చూసింది.

పన్నెండు కావస్తోంది.

"వదినింకా భోజనం చేయలేదు" అంది సుందరమ్మ.

"వదినా, పద. నువ్వు భోంచెయ్యి. నేను సాయం కూర్చుంటాను. అన్నయ్య ఏ సినిమాకో వెళ్ళుంటాడు. రెండు లోపల తప్పకుండా వస్తాడు."

"నాతో చెప్పకుండా మీ అన్నయ్య సినిమాకి వెళ్ళరు."

"ఇంతకీ ఆఫీసునుంచి యింటికి తిరిగొచ్చి అన్నయ్య ఎక్కడికెళ్ళాడు?"

"నీ పెళ్ళికి డబ్బు తేడానికి ఎక్కడికో వెళుతున్నానన్నారు. వివరాలు నాతో చెప్పలేదు."

జానకి తటాలున లేచి నిలబడింది. క్షణకాలం ఆలోచిస్తూ వుండిపోయింది.

"పక్కింట్లో వుండే అడ్వకేట్ రామాచారిగారితో మాట్లాడ్డం మంచిదేమో! అన్నయ్య ఆఫీసుకి ఫోన్ చేసి కనుక్కోవచ్చు" అంది జానకి.

"చేసి చూడు" అంది సుమతి.

ముందు తలుపు తెరుచుకుని జానకి బయటకు వెళ్ళింది. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. పక్కనే వున్న తలుపును ఆమె తట్టింది. అడ్వకేట్ రామాచారి స్విచ్ ఆన్ చేసి తలుపు తెరిచాడు. ఆమె హాల్లోకి నడిచింది.

"ఏమిటమ్మా? నువ్వా!" అన్నాడు రామాచారి.

"రామాచారిగారూ, అన్నయ్య యింకా తిరిగిరాలేదు. ఆఫీసులో వున్నాడేమో అని నాకు అనుమానంగా వుంది. ఒకసారి ఫోన్ చేసి కనుక్కుంటారా?"

"నంబరెంతమ్మా?" అని అడిగి అతడు రిసీవరెత్తాడు.

ఆమె నంబరు చెప్పింది. అతడు రెండు మూడుసార్లు డయల్ చేసి చూశాడు.

"ఆఫీసులో ఎవరూ వున్నట్టులేదు. ఎవరూ రిసీవరెత్తడంలేదు" అన్నాడు రామాచారి.

ఏం చెయ్యాలో తోచక జానకి మౌనం వహించింది. ఆవులిస్తూ ఆమెవైపు చూశాడు రామాచారి.

"భయపడకండమ్మా, మంత్రిగారి ఆఫీసులో మీ అన్నయ్య సెక్రటరీగా వుంటున్నాడు. అతడికి అనేక పనులుంటాయి. కాస్సేపట్లో వస్తాడు."

రామాచారికి థాంక్స్ చెప్పి ఆమె తనింటికి తిరిగి వెళ్ళిపోయింది.

"అన్నయ్య ఆఫీసులో లేడమ్మా" అంది జానకి.

"ఆఫీసుకు వెళ్ళలేదని నేను మొదటే చెప్పానుగా?" అంది సుమతి.

"ఇంత రాత్రివేళ మనం చెయ్యగలిగిందేమీ లేదు. మరి కొంతసేపు చూసి తరవాత ఆలోచిద్దాం!" అని జానకి సలహా యిచ్చింది.

"అవునమ్మా నువ్వు భోజనంచేసి పడుకో. వాడు వస్తాడు. రాకపోతే చూద్దాం" అంది సుందరమ్మ.

సుమతి మౌనంగా లేచి పక్క గదిలోకి దూరింది. జానకి, తల్లి వాళ్ళ పక్కలమీద నిద్రమత్తుతో వాలిపోయారు. నిముషాలు గడిచిపోతున్నాయి.

పడగ్గదిలో లైటు వెలుగుతోంది. సుమతి నిద్రపట్టక యిటూ అటూ దొర్లుతోంది. భర్త మొహం ఆమెకు జ్ఞాపకొస్తోంది. ఒక్కోసారి రాత్రంతా అతడు పనిమీద వుండిపోయేవాడు. కాని ముందుగా ఆమెతో చెప్పేవాడు. తనతో చెప్పకుండా అతడింత ఆలస్యం ఎన్నడూ చెయ్యలేదు. అతడికి ఏదేనా ప్రమాదం సంభవించిందా? ఏదైనా ఆక్సిడెంట్ అయిందా? ఏవేవో ఆలోచనలు ఆమె మెదడులో తిరుగుతున్నాయి. గుమ్మం దగ్గరకు వెళ్ళి ఆమె హాల్లోకి చూసింది. సుందరమ్మ, జానకి గాఢ నిద్రలో వున్నారు. హాల్లోని లైటుని ఆఫ్ చేసి ఆమె పడగ్గదిని చేరుకుంది. పడగ్గదిలోని లైటును తీసేసి పరుపు మీద పడుకుని భర్తను గురించే ఆలోచిస్తోంది.

# 4

టెలిఫోన్ రింగ్ విని లేచాను. పక్కనున్న స్విచ్ నొక్కాను. లైటు వెలిగింది. రిసీవరెత్తి, "హాలో, పరశురామ్ స్పీకింగ్" అన్నాను. అటువైపు కంఠం ఇన్స్పెక్టర్ నాయర్ది.

"నాయర్ భాయ్, ఇవాళ నీ వైఫ్ బర్తుడేగా? ఇంకా యింటికెళ్ళలేదా?" ప్రశ్నించాను.

"ఎక్కడిల్లు బ్రదర్? ఇప్పుడే ఒక శవాన్ని గురించి రిపోర్టు వచ్చింది. నేను శవం పడున్న స్థలానికి వెళ్ళి అంతా చూసి ఒక హోటలునుంచి నీకు ఫోన్ చేస్తు

న్నాను. నువ్వోసారి వస్తే బావుంటుంది" అన్నాడు నాయర్.

"ఎక్కడుంది శవం?"

"తుగ్లక్ రోడ్డువారగా పడుంది."

"ఆల్‌రైట్ వస్తున్నా" అని రిసీవర్ పెట్టేశాను. పరుపువిూంచి కిందకు దిగాను. సుఖనిద్రలో మునిగి వున్న పార్వతిలో ఏవేవో కొత్త అందాలు నాకు కనిపించాయి. ఆమె బుగ్గమీద సున్నితంగా ముద్దుపెట్టుకుని, ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించి బయటకు నడిచాను. మెట్లు దిగాను. వరండాలో పడుకున్న క్రిష్ణయ్య నా బూట్ల చప్పుడు విని మేలుకున్నాడు. కారు షెడ్‌వైపు వెళ్తూ తలుపేసుకోమని అతడ్ని హెచ్చరించాను.

డాడ్జి కారును గేటువైపు పోనిచ్చాను. వాచ్‌మన్ రాణా గేటు తెరచి నాకు శల్యూట్ చేశాడు. కారు రోడ్డమ్మట దూసుకుపోతోంది. డిజిటల్ వాచ్ చూశాను. టయిమ్ పదకొండూ యాభైమూడు అయింది. చల్లటి గాలి వీస్తోంది. రోడ్లమీద అక్కడక్కడ కొందరు తిరుగుతున్నారు. కుక్కలు మొరుగుతున్నాయి. తుగ్లక్ రోడ్డువైపు కారు తిప్పాను. చీకటిగా వుంది. రోడ్డులైటు వెలగడంలేదు. లైట్లను ఎవరో పగలగొట్టి వుంటారు. తుగ్లక్ రోడ్డు స్మగులర్స్‌కు రహదారని ప్రెస్ విలేఖర్లు రాస్తూంటారు.

పోలీస్ జీప్‌ను చూసి వెనుకనే డాడ్జికారును ఆపి దిగాను. పెట్రోమాక్స్‌లైటు ప్రకాశవంతంగా వెలుగుతోంది. అరడజను మంది కానిస్టేబుల్సు నాకు కనిపించారు. ఇన్స్‌పెక్టర్ నాయర్ నావైపు వచ్చాడు. అతడితో కరచాలనం చేసి శవం పడున్న చోటుకి

వెళ్ళాను.

రోడ్డు వారగా పడున్న శవంవైపు చూశాను. శవం భయంకరంగా ఉంది. మొహం పచ్చబడయిపోయింది. పేగులు బయటకు వేళ్ళాడుతున్నాయి. మోకాళ్ళు, పాదాలు తలనుంచి కాళ్ళదాకా ఒళ్ళంతా నలిగిపోయి ముద్దయినట్లుంది. చిరిగిన అండర్ వేర్, బనియన్ వికృతంగా కనిపిస్తున్నాయి.

"హారిబుల్!" అన్నాను.

"బ్రదర్, బయట వూళ్ళనుంచి వచ్చే స్మగులర్స్ కార్లు ఈ రోడ్డమ్మట పట్నంలోకి వెళ్తూ వుంటాయి. ఏ కారో యితడ్ని క్రిందపడగొట్టి మాయమయి వుంటుంది. ఇదొక హిట్ అండ్ రన్ కేసు అయివుండాలి," అన్నాడు నాయర్.

జవాబివ్వకుండా రూపంలేని శవాన్ని పరీక్షిస్తూ వుండిపోయాను. అయిదు నిముషాల తరువాత శవానికి కొంచెం దూరంగా నడిచి సిగరెట్ వెలిగించి పొగ వదులుతూ ఇన్స్పెక్టర్ నాయర్ కేసి చూశాను.

"నాయర్ భాయ్ ఏ కారుకిందో పడి యితడు మరణించాడని స్పష్టంగా తెలుస్తోంది. అండర్ వేర్ బనియన్లో అతడు ఈ రోడ్డమ్మట ఎందుకు నడిచాడు? సాధారణంగా ప్రజలు ఈ రోడ్డును వాడరు." అన్నాను.

"అవును బ్రదర్. నువ్వు చెప్పింది నిజమే. ఇతను ఎవరో బికారయి వుండాలి." అన్నాడు నాయర్.

ఇన్స్పెక్టర్ నాయర్ వైపు సూటిగా చూశాను.

"నాయర్ భాయ్, శవాన్నిబట్టి యిది హిట్ అండ్ రన్ కేసు కాదని మనం ఊహించవచ్చు. ప్రమాదవశాత్తూ ఏ కారుక్రిందో యితను పడివుంటే; ఆ కారు దూసుకు

బోయుంటే శవం మరోవిధంగా వుండేది. శరీరంలో కొన్ని భాగాలు మాత్రం నలిగి వుండేవి. శవాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక విషయం నీకు తెలుస్తుంది. ఇతడ్ని పడగొట్టినకారు దూసుకుపోలేదు. వెనక్కి ముందుకు కదుల్తూ శవాన్ని పచ్చడిచేసింది. అతడి ఎడంచేతి మీద రిస్టువాచ్ గుర్తులు ఉన్నాయి. కాని వాచ్ లేదు. అతని దుస్తులు లేవు అతడి కాళ్ళకు జోళ్ళు లేవు. నా దృష్టిలో ఇది యాక్సిడెంటు కాదు. కోల్డు మర్డర్!"

నాయర్ నావైపు ఆశ్చర్యంగా చూశాడు.

"నాయర్ భాయ్ యితని వస్తువులన్నీ ఎవరో పట్టుకు పోయుంటారు. పోల్చలేని స్థితిలో శవాన్ని రోడ్డువారగా వదిలేశారు. ఇతడెవరో మనం కనుక్కోవాలి. శవం ఎవరిదో తెలిస్తేగాని మనం ఏమీ చెయ్యలేం."

ఇన్స్పెక్టర్ నాయర్ తలాడించాడు. నా కారు వెనకనే మరో కారొచ్చి ఆగింది. డాక్టర్ సుధాకర్ మావైపు వచ్చాడు. ఇన్స్పెక్టర్ నాయర్ డాక్టర్ సుధాకర్‌తో శవంవైపు వెళ్ళాడు. రోడ్డమ్మట చీకట్లో కొంతదూరం నడిచాను. రోడ్డువారగా వున్న స్థంభంవేపు చూశాను. ఆగాను. జేబులోంచి టార్చితీసి బటన్ నొక్కాను. టార్చికాంతిలో పైకిచూశాను. పైన అమర్చిన ఫ్లోరసెంట్ ట్యూబ్ పగిలి వుంది. టార్చిని జేబులో వేసుకుని వెనక్కి తిరిగాను. ఆలోచిస్తూ నడుస్తున్నాను. స్మగులర్స్‌కి చీకటి రోడ్లు కావాలి. రోడ్లలైట్లను ధ్వంసం చేసి వాళ్ళు చీకటిని సృష్టించుకుంటారు.

డాక్టర్ సుధాకర్ శవాన్ని పరీక్షిస్తున్నాడు. డాడ్జి కారుపక్కనే నిలబడి మరో సిగరెట్టు వెలిగించాను. కాసేపట్లో ఇన్స్పెక్టర్ నాయర్, డాక్టర్ సుధాకర్ నాదగ్గర

కొచ్చారు.

"పరశురామ్‌గారూ, ఇతడు మరణించి ఓ గంట పైన దాటివుంటుంది. శవాన్ని చూస్తే ఎన్నో కార్లు దానిమీద నుంచి వెళ్ళిపోయుండాలనిపిస్తోంది" అన్నాడు డాక్టర్ సుధాకర్.

తలుపులు తెరిచి స్టీరింగ్ వీలు వెనుక కూర్చున్నాను. డాక్టర్ సుధాకర్‌కి గుడ్‌నైట్ చెప్పి నాయర్ వైపు చూశాను.

"నాయర్ భాయ్ శవాన్ని మార్చురీకి పంపించు. ఎవరో దాన్ని గుర్తించొచ్చు. తరువాత చెయ్యగలిగింది చూద్దాం."

"అలాగే బ్రదర్" అన్నాడు నాయర్.

ఇన్స్‌పెక్టర్ నాయర్‌కి గుడ్‌నైట్ చెప్పి, డాడ్జి కారును తుగ్లక్ రోడ్డువైపు పోనిచ్చాను.

## 5

హాల్లో సుమతి ఏడుస్తూ కూర్చుని వుంది. జానకి సుందరమ్మ పక్కనే కూర్చుని ఏడుస్తున్నారు. అడ్వకేట్ రామాచారి కుర్చీలో కూర్చుని వున్నాడు.

"నిన్న రాత్రి బలరామ్ ఎక్కడికెళ్ళాడో కాని అతడీవేళ తన ఆఫీసుకి హాజరు కాలేదు. ఫోన్ చేసి కనుక్కున్నాను. బలరామ్ గురించి పోలీసు రిపోర్టు కూడా యిచ్చాను" అన్నాడు రామాచారి.

"అన్నయ్య ఏ ఊరైనా వెళ్ళాడేమో" అంది జానకి.

"ఇంట్లోవాళ్ళకి చెప్పకుండా ఆయన వెళ్ళరు" అంది సుమతి.

బయట పోలీస్ జీప్ ఆగింది. రామాచారి గుమ్మం వైపు పరుగెత్తాడు.

సబ్ ఇనస్పెక్టర్ రామన్ జీపులోంచి దిగి రామాచారి వైపు చూశాడు.

"మిస్టర్ బలరామ్ యిల్లు ఇదేనా?"

"అవును" అన్నాడు రామాచారి.

"ఆయన మాయమయినట్లు మీరు రిపోర్టు యిచ్చారా?"

"రిపోర్టు నేనే యిచ్చాను. నా పేరు రామాచారి."

"మీరు మాతో రండి."

"బలరామ్ దొరికాడా?"

"ఆయన మీకేమవుతాడు?"

"నేను పక్కింట్లో వుంటున్నాను. బలరామ్‌కి భార్యా, తల్లీ, ఒక చెల్లెలూ వున్నారు. వాళ్ళు ఈ యింట్లో వుంటున్నారు."

"రామాచారిగారూ, నిన్న రాత్రి కారు ఏక్సిడెంట్‌లో మరణించిన ఒక వ్యక్తి శవం రాయపేట హాస్పిటలులో వుంది. ఆ శవాన్ని యింతవరకూ ఎవరూ పోల్చలేదు. మీరొకసారొచ్చి ఆ శవాన్ని చూడ్డం మంచిది."

"ఉండండి, యిప్పుడే వస్తాను" అని రామాచారి లోపలకు వెళ్ళాడు.

అరగంట దాటింది. ఒక కానిస్టేబులు శవాన్ని కప్పిన గుడ్డను తొలగించాడు. రామాచారి శవాన్ని చూశాడు. ఆ శవం ఎవరిదో అతడికి తెలీలేదు. సుందరమ్మ శవాన్ని చూసి కళ్ళుమూసుకుంది. జానకి భయంతో శవాన్ని పరిశీలిస్తోంది. వెక్కి వెక్కి ఏడుస్తూ సుమతి శవం మీద వాలిపోయింది. సబిన్స్పెక్టర్ రామన్ ఆమె దగ్గరకు జరిగాడు.

"ఈ శవం బలరామ్ గారిదేనా?"

సుమతి జవాబివ్వలేదు. శవం మీద పడి పిచ్చిగా ఏడు

స్తోంది.

"ఊరుకో వదినా. ఈ శవం అన్నయ్యది కాదు," అంది జానకి.

"ఆయనదే" ఘొల్లున అరిచింది సుమతి.

సబిన్స్పెక్టర్ రామన్ వాళ్ళందర్నీ బయటకు తీసుకు పోయాడు. కాన్స్టేబుల్లో వాళ్ళందరూ ఇంటికి చేరు కున్నారు.

* * *

ఇన్స్పెక్టర్ నాయర్ కి ఎదురుగా కుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగించాను.

"నాయర్ భాయ్ ఏదైనా తెలిసిందా?"

"ఇంతవరకూ ఏదీ తెలియలేదు. అన్ని పోలీస్ స్టేషన్లకు క్రితం రాత్రి దొరికిన శవంగురించి వార్త పంపాం. తమ చుట్టాలెవరేనా మాయమయ్యారని రిపోర్టు యిచ్చిన వాళ్ళను తీసుకెళ్ళి చూపించమన్నాం."

టేబులుమీదున్న టెలిఫోన్ మ్రోగింది. రిసీవరెత్తి నాయర్ మాట్లాడసాగాడు. అతనిమాటల్ని వింటూంటే నాలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది.

రిసీవర్ని పెట్టేసి ఇన్స్పెక్టర్ నాయర్ నావైపు విజయవంతంగా చూశాడు.

"బ్రదర్ సబిన్స్పెక్టర్ రామన్ ఫోన్ చేశాడు. ఆ శవం బలరామ్ అనే వ్యక్తిది. బలరామ్ మాయమయ్యా డని ఇవాళ పొద్దుటే వాళ్ళు రిపోర్టు యిచ్చారు. సబిన స్పెక్టర్ రామన్ వాళ్ళను తీసుకెళ్ళి శవాన్ని చూపిం చాడు. సుమతి తన భర్త శవాన్ని వెంటనే పోల్చ గలిగింది."

"గుడ్ బ్రేక్!" అన్నాను.

"బలరామ్‌ది చిన్న కుటుంబం. తల్లి పేరు సుందరమ్మ. జానకి చెల్లెలు. భార్య పేరు సుమతి. నిన్న రాత్రినుంచీ అతను కనపడ్డంలేదుట."

కుర్చీలోంచి లేచాను.

"వాళ్ళ ఇంటి అడ్రసు కనుక్కున్నావా?"

"నంబరు 12, రాజాస్ట్రీట్, తేనాంపేట."

"నాయర్ భాయ్, నేనక్కడికి వెళ్ళి మాట్లాడతాను. బై బై," అని బయటకు పరుగెత్తాను.

ఒక చిన్న ఇంటిముందు కారాపి దిగాను. ముందు తలుపుమీద పన్నెండు నంబరు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. పక్కనే వున్న మరో తలుపుమీద 12 ఎ నంబరుంది. గోడమీద అడ్వకేట్ రామాచారి బోర్డు తగిలించబడి వుంది. పన్నెండో నంబరింట్లోకి ప్రవేశించాను. హాల్లో ఆడవాళ్ళు మాత్రం వున్నారు. ముగ్గురూ ఏడుస్తున్నారు. ముసలామె బలరామ్ తల్లయివుండాలి. బలరామ్ భార్యనీ, చెల్లెల్నీ క్షణంలో పోల్చగలిగాను. ఇరుగు పొరుగువాళ్ళు వాళ్ళను ఓదారుస్తున్నారు.

గదిలోకొచ్చిన నావైపు జానకి విచారవదనంతో చూసింది.

"మీరు అన్నయ్య ఆఫీసునుంచి వస్తున్నారా?"

కాదని తలాడించి ఆమెకు నా పేరు చెప్పాను. గోడవారగా వున్న కుర్చీని నావైపు లాగి ఆమె కూర్చోమంది. నా ఎదురుగా నేలమీద చతికిలబడి ఆమె వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమెవైపు జాలిగా చూశాను. ఆమె వయస్సు ఇరవై దాటి వుండదు. పచ్చగా అందంగా ఉంది.

"ఆ శవం మీ అన్నయ్యదేనా?"

"పరశురామ్‌గారూ, అన్నయ్య మరణించాడంటే నేను నమ్మలేకుండా వున్నాను. మొదట్లో అన్నయ్యది కాదనుకున్నాను. కాని వదిన వెంటనే పోల్చగలిగింది. కొంతసేపయ్యాక అమ్మ కూడా అన్నయ్యదేనంది. ఆ శవం అన్నయ్యదని చివరకి నాకు కూడా నమ్మకం ఏర్పడింది!"

"మీ అన్నయ్య ఎక్కడ పనిచేస్తున్నాడు?"

"మినిస్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ ఆఫీసులో నలుగురు సెక్రట్రీలున్నారు. అందులో ఒక సెక్రట్రీ మా అన్నయ్య."

"ఆ ఆఫీసునుంచి ఎవరేనా యిక్కడికి వచ్చారా?"

"ఎవరూ రాలేదు!"

"నిన్న మీ అన్నయ్య ఆఫీసునుంచి ఇంటికొచ్చాడా?"

"ఆరింటికొచ్చాడు. దీన్ని గురించి వదిన మీతో ఎక్కువగా చెప్పగలదు," అంది జానకి.

గోడవారగా కూర్చున్న సుమతివైపు చూశాను. ఏడుస్తూన్న ఆమె కళ్ళు నావైపు తిరిగాయి.

"నిన్న రాత్రి యింటికొచ్చినప్పుడు బలరామ్ ఎలా వున్నాడు?"

ఆమె జవాబివ్వలేదు. వెక్కి వెక్కి ఏడవసాగింది. జానకి వదిన దగ్గరగా జరిగింది.

"వదినా పరశురామ్‌గారికి అంతా చెప్పు. అన్నయ్య ఈ దుస్థితికెలా వచ్చాడో ఆయన కనుక్కుంటారు."

సుమతివైపు జాలిగా చూశాను.

"ఆయన మామూలుగా లేరు; ఎందుకో గాభరాగా వున్నారు. పెన్‌కోసం ఆయన ప్లాస్టిక్ బాగ్‌ను నేను తెరిచాను. తటాలున ఆయనొచ్చి బాగ్‌ను లాక్కున్నారు. దాన్ని ముట్టుకోవద్దన్నారు. అందులో ఏవో ముఖ్య

మయిన కాగితాలున్నాయన్నారు."

"ఇంటికొచ్చి అతను ఎక్కడికెళ్ళాడు?"

"ఎక్కడికెళ్ళారో నాకు తెలీదు. ఏడు గంటలు దాటాక వెళ్ళారు. పదిలోపల తిరిగి వస్తానన్నారు. జానక్కి ఈ మధ్యనే ఒక సంబంధం కుదిరింది. డబ్బు చేతికొచ్చాక పెళ్ళి చెయ్యాలని ఆయన ఉద్దేశం. నిన్న రాత్రి వెళ్ళిన పనిమీద జానకి పెళ్ళి ఆధారపడి వుందని ఆయన నాతో అన్నారు."

క్షణకాలం సిగరెట్ వెలిగిస్తూ ఆలోచిస్తూ వుండి పోయాను. నా మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. చెల్లెలి పెళ్ళి, బాగ్ లో ముఖ్యమయిన కాగితాలు, ఇదంతా విచిత్రంగా వుంది.

"ఎవరేనా యిక్కడికొచ్చి అతడ్ని కలుసుకుంటూ వుండేవారా?"

"ఎవరూ ఇక్కడికి వచ్చేవాడు కాదు. రాత్రిళ్ళు ఆయనకోసం ఈ మధ్య ఫోన్ కాల్సు తరుచు వస్తూ వుండేవి."

"ఫోన్ ఎక్కడుంది?"

"అడ్వకేట్ రామాచారిగారింట్లో ఫోన్ వుంది. రామాచారిగారు పదిదాకా ఇంటికి రారు. ఏదేనా ఫోన్ కాల్ వస్తే ఆయన భార్య నన్ను పిలిచేది. నే చెప్తే ఆయన వెళ్ళి మాట్లాడేవారు."

"నిన్న వెళ్ళినప్పుడు అతడు ఏ డ్రస్ లో వున్నాడు?"

"బ్లూ పాంట్, లైట్ బ్లూ స్లాక్, చేతికి సిటిజన్ ఆటోమాటిక్ వాచ్ వుండేది. కుడిచేతి వేలికి వెంక టేశ్వరుడి బొమ్మవున్న వుంగరం వుండేది. నల్లటి బాగ్ పట్టుకుని ఆయన బయటకు వెళ్ళారు. ఆయన రోడ్డుమీద

పడుండగా ఎవరో ఆవన్నీ పట్టుకుపోయూంటారు," అంది సుమతి.

"పరశురామ్‌గారూ, శవాన్ని చూసి జాలిపడేవారు కొందరయితే శవం వస్తువులను దోచుకునేవారు కొందరుంటారు ఈ లోకంలో," అంది జానకి.

కుర్చీలోంచి లేచాను. వాళ్ళవైపు క్షణకాలం చూసి వెనక్కి తిరిగాను. గబగబా బయటకు నడిచాను. కారులో కూర్చుని తలుపు మూశాను. సిగరెట్ వెలిగించి కారును వేగంగా పోనిచ్చాను.

మినిస్టర్ ఫర్ ఇండస్ట్రీస్ ముఖ్య కార్యదర్శి అయిన వేణుగోపాల్ ఎదురుగా కూర్చున్నాను. అతను చాలా ఉదారయిన వ్యక్తి.

"మిస్టర్ బలరామ్ గురించి మీరేం చెప్పగలరు?" ప్రశ్నించాను.

అతడు నావైపు ఆశ్చర్యంగా చూశాడు.

"పరశురామ్‌గారూ, బలరామ్ రాకకోసం నేను పొద్దుట్నించీ ఎదురు చూస్తున్నాను. ఎందువలనో అతనింత వరకూ రాలేదు!"

"మిస్టర్ వేణుగోపాల్, బలరామ్ ఇక్కడికి రాలేడు. నిన్నరాత్రి అతడు మరణించాడు."

వేణుగోపాల్ అమాంతంగా కుర్చీలోంచి లేచాడు.

"బలరామ్ మరణించాడా? ఎలా?"

అతడివైపు సూటిగా చూశాను.

"అది ఏక్సిడెంట్ కావచ్చు, హత్య కావచ్చు. ప్రస్తుతం చెప్పలేను."

వేణుగోపాల్ జీవంలేనట్టు కుర్చీలో కూలిపోయాడు.

"పరశురామ్‌గారూ, ఏంచెయ్యాలో తోచడంలేదు.

ఒక ఫైల్లోంచి అతి ముఖ్యమయిన పత్రం మాయమయింది. మంత్రిగారు ఆ పత్రం కోసం మూడుసార్లు నాతో మాట్లాడారు. బలరామ్ వచ్చాక పట్టుకొస్తానని ఆయనతో చెప్పాను. ఇప్పుడా పత్రం ఎక్కడుందో తెలుసుకోడం సాధ్యంకాదు. మంత్రిగారు నన్ను ఎడా పెడా తిడతారు."

"మిస్టర్ వేణుగోపాల్ ఆ పత్రం ఏమిటి?"

"దాన్ని గురించి నేను చెప్పలేను సార్! అది చాలా రహస్యమైనది. అదుంటేగాని ఆ దుర్మార్గుడ్ని ఎవ్వరూ ఏదీ చెయ్యలేరు."

"ఎవరా దుర్మార్గుడు?"

టేబులుమీదున్న టెలిఫోన్ మ్రోగింది. రిసీవరెత్తి వేణుగోపాల్ మాట్లాడి, రిసీవర్ని పెట్టేసి నావైపు చూశాడు.

"పరశురామ్‌గారూ, దయచేసి మీరిక్కడే ఉండండి, క్షణంలో వస్తాను," అని అతను బయటకు పరుగెత్తాడు.

కాస్సేపట్లో వేణుగోపాల్ తిరిగొచ్చాడు. కుర్చీలో కూర్చుని నా చెయ్యిపట్టుకున్నాడు. అతని కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"పరశురామ్‌గారూ మీరు నాకు సహాయపడాలి. జీడి పిక్కలావుండే బలరామ్ ఇంత హఠాత్తుగా మరణించడం అసహజంగా వుంది. ఫైల్లోంచి మాయమయిన పత్రానికీ, అతడి చావుకూ ఏదో సంబంధముందని నా అనుమానం. మీకంతా వివరంగా చెప్తాను. ఏం జరిగిందో మీరు కనుక్కుంటే సంతోషిస్తాను."

"చెప్పండి."

"రంజిత్ షా గురించి మీరు వినే ఉండారు, అతడు

రాష్ట్రప్రభుత్వాన్ని ఘోరంగా మోసంచేసి కొన్నికోట్లు సంపాదించాడు. ఫోర్జరీచేసిన పత్రంతో అతడు ఈ రాష్ట్రప్రభుత్వాన్ని మోసంచేశాడు. ఫోర్జరీచేసిన ఆ పత్రం ఈ మధ్యనే మాకు చిక్కింది. దాని ఆధారంగా అతడిమీద యేక్షన్ తీసుకోవాలని మంత్రిగారి ఉద్దేశం. ఇప్పుడా పత్రం మాయమయింది. బలరామ్‌ని నమ్మించి బ్రెయిన్ వాష్ చేసి వుండొచ్చు. అతడు దేవాంతకుడు. తన స్వార్థం కోసం ఎంత మందినేనా తుదముట్టిస్తాడు."

"మిస్టర్ వేణుగోపాల్, బలరామ్ ఎటువంటివాడు?"

"బలరామ్ మంచివాడు. లంచాలు తీసుకునే తత్వం కాదు. కాని కొన్ని పరిస్థితుల్లో మంచివాళ్ళు మారుతూ వుంటారు. ధనపిశాచానికి తల వంచవలసి వస్తుంది."

కుర్చీలోంచి లేచాను. వేణుగోపాల్కి బై బై చెప్పి బయటకు నడిచాను. స్టీరింగ్ వీలు వెనుక కూర్చుని తలుపు మూసి సిగరెట్టు పొగపీల్చి వదులుతూ తీవ్రంగా ఆలోచిస్తూ వుండిపోయాను. కోటీశ్వరుడు రంజిత్ షాను క్రితం రాత్రి బలరామ్ కలుసుకుని ఆ పత్రాన్ని అతడికి యిచ్చాడా? చెల్లెలి పెళ్ళి తొందరగా చెయ్యాలనే ఉబలాటం మూలంగా బలరామ్ డబ్బుకోసం అడ్డదారి తొక్కవలసి వచ్చిందా?

ఆలోచిస్తూ కారును పోనిచ్చాను.

# 6

రంజిత్ షాకు ఫోన్ చేశాను. అతడి సెక్రటరీ మిస్ మూసా కమ్మటి కంఠంతో, "హలో!" అంది.

"పరశురామ్ హియర్" అన్నాను.

"మిస్టర్ పరశురామ్, మీతో మాట్లాడుతున్నందుకు ఆనందంగా వుంది. ఏం కావాలో చెప్పండి" అందామె.

"రంజిత్ షాతో మాట్లాడాలి."

"జస్టు ఎ మోమెంట్ ప్లీజ్!"

కాస్సేపయ్యాక పురుష కంఠం అటువైపునుంచి వినబడింది.

"మిస్టర్ పరశురామ్, మీరు నాకు ఫోన్ చేయడం ప్లెజెంట్ సర్‌ప్రైజ్!"

"మీతో మాట్లాడాలి!"

"వెల్కమ్ టూ మై ఫ్లాట్ యిన్ రంజిత్ మాన్షన్స్! ఇవాళ రాత్రి తొమ్మిది తర్వాత నేను ఫ్రీగా వుంటాను. మనం ఎంతసేపైనా స్కాచ్ సేవిస్తూ మాట్లాడుకోవచ్చు."

"ఆల్‌రైట్, తొమ్మిదింటికి వస్తాను" అని రిసీవర్ పెట్టేశాను.

సిగరెట్ పీలుస్తూ సోఫాలో కూర్చున్నాను. టెలిఫోన్ మ్రోగింది.

"హలో, పరశురామ్ హియర్" అన్నాను.

"నాయర్ స్పీకింగ్! బ్రదర్ ఏదేనా తెలిసిందా?"

"రాత్రి తొమ్మిదింటికి రంజిత్ షాను కలుసుకోబోతున్నాను."

"బలరామ్ మరణంతో అతడికేదేనా సంబంధముందా?"

"వుంటే తెలుస్తుంది."

"బ్రదర్, అతడొక ఇంటర్నేషనల్ క్రూక్ అని విన్నాను. కాని ఎవరికీ దొరకడు. ఎనిమిదో అంతస్తులో వున్న ఫ్లాట్‌లో కావలసిన వాళ్ళను కల్సుకుంటూ వుంటాడు. అక్కడనుంచి బయటపడ్డం అంత సులువు కాదు!" అన్నాడు నాయర్.

"డోంట్ బాదర్! నేనక్కడ వుండడం రంజిత్ షా ఆరోగ్యానికి మంచిదికాదు. అతడే నన్ను సంతోషంగా సాగనంపుతాడు."

"శవ పరీక్ష అయింది. నువ్వు అన్నట్లు అది కోల్డు మర్డర్!"

"నాయర్ భాయ్, చూద్దాం. రంజిత్ షాతో మాట్లాడాక నీకు ఫోన్ చేస్తాను" అని రిసీవర్ పెట్టేశాను.

ఎనిమిదో అంతస్తులో వున్న ఫ్లాట్ కు లిఫ్ట్ లో వెళ్ళాను. లిఫ్ట్ లోంచి నడవమీదకు నడిచాను. మిస్ మూసా నవ్వుతూ నన్ను ఆహ్వానించింది.

మిస్ మూసా వయస్సు యిరవై రెండేళ్లు వుంటుంది. ఆమె గోవానీస్ యువతి. చాలా అందంగా వుంటుంది.

"మిస్టర్ పరశురామ్, వెల్కమ్!" అందామె.

ఆమె వెనకనే వెళ్ళాను. ఒక తలుపును ఆమె తోసింది. నేను లోపలకు వెళ్ళాను. విశాలమైన హాలు. ఇంద్ర భవనంలా వుంది. రంజిత్ షా కోటీశ్వరుడని యీ హాలు ప్రకటిస్తోంది.

రంజిత్ షా అమెరికన్ సూటులో అఖండంగా వున్నాడు. సన్నగా పొడుగ్గా వున్నాడు. జుత్తు బాగా తెల్లబడింది. అతడు వుషారుగా నాతో కరచాలనం చేసి కూర్చోమన్నాడు.

అరడజను ఫ్లోరసెంట్ లైట్లు వెలుగుతున్నాయి. ఫోమ్ సోఫాలో కూర్చున్నాను. పక్కనే అతడు చతికిలబడ్డాడు. మిస్ మూసా ఎదురుగావచ్చి నిలబడింది.

"మిస్ మూసా, డ్రింక్స్ ప్లీజ్! మిస్టర్ పరశురామ్, మిస్ మూసా నా కుడి చెయ్యి. ఆమె లేకుండా ఇక్కడ ఏ పనీ సాగదు" అన్నాడతను,

మిస్ మూసా కాస్సేపట్లో తిరిగివచ్చింది. మాముందున్న టీపాయ్‌మీద రెండు గ్లాసులు పెట్టింది. రాయల్ సెల్యూట్ విస్కీ గ్లాసుల్లో పోసి. ఐస్ క్యూబ్స్ పడేసి, సోడా కలిపింది. ఇద్దరం గ్లాసులందుకున్నాం.

"ఛియర్స్" అన్నాడు రంజిత్ షా.

"ఛియర్స్" అన్నాను నవ్వుతూ.

కొంచెం దూరంగా జరిగి టేబులు వెనుకనున్న కుర్చీలో మిస్ మూసా కూర్చొని ఏదో ఫైలు తిరగేస్తోంది.

"మిస్టర్ పరశురామ్, ఇలా మీరు రావడం నా హృదయాన్ని ఆనందంతో నింపింది" అన్నాడతను.

"నేనొచ్చిన పని తెలిశాక మీరంత ఆనందించరేమో!" అన్నాను నవ్వుతూ.

"నాతో పనా? ఏమిటో చెప్పండి!"

"బలరామ్!" అన్నాను క్లుప్తంగా.

అతడు నావైపు ఆశ్చర్యంగా చూశాడు. గ్లాసులోని విస్కీని కొంచం త్రాగాడు.

"బలరామ్ ఎవరో నాకు తెలీదు!"

"మిస్టర్ షా అతను మీకు బాగా తెలుసు. మినిస్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ ఆఫీస్‌లో అతను సెక్రటరీగా పనిచేసేవాడు. మీకు అతి ముఖ్యమయిన పత్రాన్ని నిన్నరాత్రి పట్టుకొచ్చి అందించాడు. ఆ తర్వాత అతను యింటికి చేరుకోలేదు!"

"ఎక్కడకు పోయాడు?"

"అది మీకు తెలిసుండొచ్చని యిలా వచ్చాను."

అతడు గ్లాసు ఖాళీచేశాడు. పక్కనే నా ఖాళీ గ్లాసుంది.

"మిస్ మూసా, ప్లీజ్!" అన్నాడతను.

డ్రింక్ పోసి ఆమె వెళ్ళిపోయింది.

"మిస్టర్ పరశురామ్. అతడు నన్ను కల్సుకోలేదు. అతడి కోసం మీరు రాంగ్ ప్లేస్‌లో వెతుకుతున్నారు!"

"మిస్టర్ షా, ప్రభుత్వం ఫైల్లో మీకు సంబంధించిన పత్రం లేదు!"

"మన ప్రభుత్వానికి ఫైల్సును జాగ్రత్తగా చూసుకునే అలవాటు లేదని మనం అనుకోవాలి!"

"జాగ్రత్తగా వుంచుకున్న ఫైల్సునుంచి పత్రాలను ఎగరేసుకుపోయే నేర్పరితనం కొందరికుందని కూడా మనం అనుకోవచ్చు!"

అతడు సూటిగా నావంక చూశాడు.

"మిస్టర్ పరశురామ్, నా ఆస్తి, హోదాచూసి అనేకమంది యీర్ష్యతో ఏడుస్తారు. నా గురించి కంప్లెయింట్లు ప్రభుత్వానికి పంపుతూ వుంటారు. కాని ఏదీ చేతికి చిక్కక ప్రభుత్వం వూరుకుంటుంది."

"ఆ పత్రం మీకు చేరిందా?"

"నాకు అందలేదు. ఎవడో దాన్ని కొట్టేసివుండొచ్చు. వాడు నా దగ్గరకొస్తే మీకు ఫోన్ చేస్తాను."

గ్లాసులోని విస్కీ తాగేసి తటాలున లేచాను.

"మిస్టర్ రంజిత్ షా, బలరామ్ మర్డర్ చేయబడ్డాడు. మర్డర్ చార్జిమీద మిమ్మల్ని అరెస్టుచేయక తప్పదు!"

అతడు ఉలిక్కిపడ్డాడు. మిస్ మూసా టేబులువైపు వెళ్ళాను. టేబులుమీద ఫోనుంది. రిసీవర్ ఎత్తాను. రంజిత్ షా వేగంగావచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు.

"మిస్టర్ పరశురామ్, ఎక్కడకు ఫోన్ చెయ్యాలి?"

"రోడ్డుమీద పోలీస్ జీప్ సిద్ధంగా వుంది. ఇన్స్పెక్టర్ నాయర్ ఒక ఫోన్ దగ్గర నా కాల్ కోసం ఎదురుచూస్తూ వుంటాడు."

"తొందరపడకండి! మనం మాట్లాడాలి!"

రిసీవర్ని పెట్టేశాను. ఇద్దరం సోఫాలో కూర్చున్నాం.

"మిస్టర్ పరశురాం, నేను హంతకుడిని కాను. కాని యీ సమయంలో మీతో ఒకటి చెప్తాను. అతడు బలరామ్ హంతకుడు కావచ్చు!"

"ఎవరతను?"

"అతడెవరో నాకు తెలియదు. నాకు సంబంధించిన పత్రం అతడివద్ద వుందన్నాడు. పదిలక్షలు యిస్తే నాకిస్తా అన్నాడు."

"అతను ఎప్పుడు ఫోన్ చేశాడు?"

"నిన్న రాత్రి 10-30కి నన్ను డబ్బుకోరమ్మన్నాడు. బీచ్‌లో గాంధీ విగ్రహం దగ్గర నన్ను నిలబడమన్నాడు. తను కారులో వస్తానన్నాడు."

"మీరు వెళ్ళారా?"

"లేదు. బ్లాక్ మెయిలర్‌కి తలొంచడం నాకిష్టంలేదు. ఆ పత్రం నాకొద్దన్నాను."

"ఈ మహాపట్నంలో అతడెవరో ఎలా కనుక్కోగలం?"

రంజిత్ షా కొంత సేపు ఆలోచించాడు.

"అతడి ఫోన్ నెంబరు చెప్పగలను?"

"అదెలా కనుక్కోగల్గారు?"

"నేను మాటాడుతూండగా మిస్ మూసా ఎక్స్ఛేంజ్‌కి ఫోన్ చేసి కనుక్కొంది."

"నంబరు చెప్పండి."

అతడు సౌజ్ఞ చేశాడు. ఒక కాగితం మీద ఆమె నంబరు రాసి యిచ్చింది. నంబరు చూసి, చీటీని జేబులో పడేసుకున్నాను. అతడివైపు సూటిగా చూశాను.

"ఇది అబద్ధమైతే మీరు కష్టంలో పడ్తారు!"

అతడు తీయగా నవ్వాడు.

"పరశురామ్‌గారూ, తెలుసుకున్నాక మీరు నాకు ఫోన్ చేసి థాంక్స్ చెప్తారు."

అతడికి బై బై చెప్పి బయటకు నడిచాను. మిస్ మూసా నాతో లిఫ్ట్‌దాకా వచ్చింది.

# 7

డాడ్జికారును వేగంగా పోనిస్తున్నాను. వెనకనే పోలీస్ జీప్ వస్తోంది. టైమ్ చూశాను. పన్నెండు కావస్తోంది.

గేటు మూసివుంది. గూర్ఖా ముందు పచార్లు చేస్తున్నాడు. తలుపు తెరవమని అర్చాను. అతడు నాదగ్గరగా వచ్చాడు.

"పోలీస్, ఓపెన్!" అర్చాను.

అతడు వెనకనున్న పోలీస్ జీప్‌నుచూసి పరుగెత్తుకెళ్ళి గేటు తెర్చాడు. కారును లోపలకు పోనిచ్చి మేడముందు ఆపి దిగాను. ముందు హాల్లోకి పరుగెత్తాను. హాల్లో లైట్లు వెల్గుతున్నాయి. ఎవ్వరూ లేరు. ఇన్స్‌పెక్టర్ 'నాయర్' కానిస్టేబుల్సు వెనకనే వస్తున్నారు.

కుడివైపున్న తలుపుతోసి లోపలకు వెళ్ళాను. నా వెనకనే ఇన్స్‌పెక్టర్ నాయర్ వచ్చాడు. రొటేటింగ్ కుర్చీలో కూర్చున్నతను అమాంతంగా లేచాడు.

"ఏమిటిదంతా?" అన్నాడతను.

అతడివైపు సూటిగా చూశాను. కిరాతకుడిలా

వున్నాడు. అతను టెబుల్ సొరుగులాగబోయాడు. నా పిస్టల్ని అతడివైపు గురిపెట్టాను. "చేతులెత్తు!" అరిచాను.

అతడు చేతులెత్తాడు. దగ్గరగా వెళ్ళాను.

"బలరామ్ ఏమయ్యాడు?" అడిగాను.

"నాకు తెలియదు."

"రంజిత్ షా అంతా చెప్పాడు," అన్నాను.

అతడు తృళ్ళిపడ్డాడు. తటాలున బూట్‌తో అతడిని తన్నాను. అతడు వెనక్కి పడ్డాడు. పరుగెత్తుకెళ్ళి అతడిని మళ్ళా తన్నాను. అతను దొర్లుతూ పక్కకిపడ్డాడు. వెల్లకిలా పడుకుని నావైపు చూశాడు.

"బలరామ్ ఎవరో నాకు తెలీదు. రంజిత్ షా పేరు అంతకంటే తెలీదు. నేను ధర్మంగా వ్యాపారం చేసుకుని బతుకుతున్నాను. జయంతీ ఇండస్ట్రీస్ బోర్డు మీరు బయట చూసే వుంటారు," అని అతను లేచి కూర్చున్నాడు.

ముందుకు వంగాను. అతని చెంపలు డప్పుల్లా మ్రోగాయి. నోట్లోంచి రక్తం కారుతోంది.

"బాస్టర్డ్ బలరామ్ ఎవరో తెలీకుండా రంజిత్ షాకి ఆ పత్రం ఎలా అమ్మావు?"

అతడు భయంతో నావైపు చూశాడు.

"రంజిత్ షా ఎవరికీ చెప్పనన్నాడు. అయిదు లక్షలిచ్చి ఆ పత్రాన్ని నా దగ్గర్నించి కొన్నాడు. బలరామ్ నన్ను కలుసుకున్నాడు. నేనతనికి యిరవై అయిదు వేలిచ్చాను. అది పట్టుకుని అతడు వెళ్ళిపోయాడు. అతనేమయ్యాడో నాకు తెలీదు."

"నీకు తెలుసు. నీ కారుకింద నలిగి నలిగి అతను కుక్కలా చచ్చాడు. నువ్విచ్చిన డబ్బంతా నీకు మళ్ళా

చేరుంటుంది!"

"అబద్ధం!........"

బూటుకాలు పైకెత్తాను.

"ప్లీజ్, నన్ను చంపకండి. అతడ్ని నేనే చంపిం చాను!"

వెనక నిలబడిన ఇన్స్పెక్టర్ నాయర్ అతని చేతికి బేడీలు వేశాడు. వెనక్కి తిరిగి టేబులుదగ్గరకు వెళ్లాను. రిసీవరెత్తి రంజిత్ షా నంబరు తిప్పాను.

మిస్ మూసా కంఠం అటువైపునుంచి వినపడింది.

"పరశురామ్ స్పీకింగ్! రంజిత్ షా అర్జెంటుగా కావాలి," అన్నాను.

క్షణంలో అతను అటువైపు వచ్చాడు.

"మిస్టర్ రంజిత్ షా, మీకు చాలా థాంక్స్."

"మిస్టర్ పరశురామ్, మీరు నాకు థాంక్స్ చెప్తారని మొదటే అన్నానుగా!"

"మిస్టర్ షా మీరు పూర్తిగా నిజం చెప్పలేదు. ఆ పత్రం ఏమయింది?"

రంజిత్ షా విచిత్రంగా నవ్వాడు.

"మిస్టర్ పరశురామ్, పదిమంది నామీదకు రాళ్ళు విసురుతూ వుంటే నన్ను నేను కాపాడుకోడం తప్పు కాదని మీరు వొప్పుకోవాలి. ఆ పత్రం ప్రభుత్వం ఫైల్సులో వుంటే నేను కష్టాలపాలవుతాను. అయిదు లక్షలు పడేసి దాన్ని కొన్నాను. ఆ పత్రం అగ్నిదేవుడికి ఆహుతి అయిపోయింది. అది మీ కెక్కడా దొరకదు. బలరామ్ హత్యకు నేను కారకుడ్ని కానందుకు సంతోషిస్తున్నాను."

"మిస్టరు షా, జీవితంలో అడ్డదారులు తొక్కడం

మీకలవాటయి పోయింది: కానీ ఎప్పుడో ఒకప్పుడు మీరు పోలీసులకు చిక్కుతారు" అని రిసీవర్ పెట్టేశాను.

ఇన్స్పెక్టర్ నాయర్ వైపు చూశాను.

"నాయర్ భాయ్, ఈ ఇల్లంతా సోదా చెయ్యండి. లక్షలకి లక్షలు బ్లాక్ మనీ మీకు దొరకొచ్చు."

"అలాగే బ్రదర్!" అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

ఇన్స్పెక్టర్ నాయర్ తో కరచాలనం చేసి బయటకు నడిచాను.

— :ఐపోయింది: —

# ఓ చవట కథ!

## వసుంధర

బస్ ఒక్క కుదుపుతో ఆగిపోయింది.

"ఏమయింది?" ఎవరో అడిగారు.

"ఇంజన్ ట్రబుల్ —" సమాధానం వచ్చింది.

నేను చేరదల్చుకున్న ఊరికి ఉన్నది వొక్కటే బస్సు. ఊరు వదిలిపెట్టి పది నిముషాలైనా కాకుండా అది ఆగిపోయింది. ఆగేదేదో ఊళ్ళోనే ఆగితే నా ప్రాణం సుఖంగా ఉండేది. ఇంటికిపోయి పడుకునేవాణ్ని.

డ్రైవర్ తన ప్రయత్నాలు తను చేస్తున్నాడు. కానీ పని జరగడంలేదనుకుంటాను.

ఇవి ఆర్టీసీ బస్సులు. అందువల్ల వీళ్ళు మరేదో ఏర్పాటు చేస్తారనే ఆశకూడ లేదు. వెనక్కు పోవడమే ఉత్తమం.

ప్రయాణం ఆగిపోవడంవల్ల నాకు పెద్ద ఇబ్బందేమీ లేదు. ఇదే ప్రయాణం వచ్చేవారం చేయొచ్చు. నాలా అనుకుంటున్నవాళ్ళు అక్కడ చాలామంది ఉన్నారు. అంతా కండక్టర్ చుట్టూ మూగారు.

"ఈ మధ్యలో వదిలేశావ్ - మేము వెనక్కి వెళ్ళే మార్గం చూడు" అన్నాను.

"కాసేపు చూడండి సార్!" అన్నాడు కండక్టర్.

అక్కడ రెండు గంటలు గడిచాయి. విసుగ్గా ఉంది.

ఉత్త రోడ్డు అది. పక్కన అటూ ఇటూ పొలాలు. ఓ కిళ్ళీ బడ్డీకానీ, పాత హోటలుకానీ లేదు.

"వెధవ ఇంజను-కాస్త చూసుకుని ట్రబులివ్వద్దూ!" అని అప్రయత్నంగా నే పైకి విసుక్కున్నాను. అది విని జోకు అనుకుని కొందరు నవ్వారు. నేను వాళ్ళవంక సీరియస్‌గా చూశాను.

కండక్టర్ డబ్బులు తిరిగిచ్చేయడం మొదలు పెట్టాడు. వెనక్కి పోదామనుకు నేవాళ్ళను బస్సెక్కించడం కోసం కూడా చూస్తున్నాడతను. ఊళ్ళోకి వెళ్ళే నాలుగైదు ఆర్టీసీ బస్సులు ఖాళీ లేదని వెళ్ళిపోయాయి.

అక్కడ మొత్తం నాలుగు గంటలసేపు గడిపాక నాకు ఓ బస్సు దొరికింది. ఊళ్ళోకి వచ్చేక తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాను. ముందు ఓ హోటల్లో దూరి టిఫిన్ తిన్నాను. కిళ్ళీ వేసుకున్నాను.

నిజానికి నాకు ఆకలిలేదు. కానీ నాలుగు గంటల ఒంటరితనం, దగ్గర్లో హోటళ్ళు లేకపోవడం-నాలో యేదో తినాలన్న కాంక్షను రగిల్చాయి.

కిళ్ళీ వేసుకున్నాక నాకు ఇల్లు, ఇల్లాలు గుర్తుకు రావడం జరిగింది.

ఇల్లాలుకు నేనీరోజు ప్రయాణం చేయడం ఇష్టంలేదు. సెలవుపూటా ఊరికెందుకండీ అంది.

వెర్రి మొహం-సెలవుపూట కాకపోతే ఆఫీసున్న రోజున ఊరికి వెడతారా?

అదే చెప్పాను. ఏం మాట్లాడలేదు. నన్ను దిగబెట్ట డానికి బస్టాండుకు వచ్చింది. బస్ కదిలేదాకా ఉండి కన్నీళ్ళతో వీడ్కోలిచ్చింది. ఇంతకూ నేను తిరిగిరావడం ఎప్పుడనుకున్నారు?.... రేపు ఉదయం.... రేపంటే రేపు ఉదయమే!

ఈ ఆడాళ్ళంతే! చీటికీ మాటికీ కన్నీళ్ళు. అందు లోనూ నా భార్యసంగతి చెప్పక్కర్లేదు. అది ఈ యుగంలో పుట్టాల్సిందికాదు. దానికి నా కాల్లోతప్ప ముఖం కనబడదు. అలాంటి ఆడాళ్ళంటే నాకు చిరాకు. నా భార్యన్నా నాకు చిరాకే! కానీ యేంచేస్తాం- తప్పదు! ఈ పవిత్ర భారతదేశంలో పుట్టినందు కిలాంటి భార్యల్ని భరించక తప్పదు!

ఆ విషయమే దానికి చెప్పి మరీ భరిస్తున్నాను.

దానికి సిగ్గులేదు. ఎన్ని మాటలన్నా భరిస్తుందది. తిడితే నవ్వుతుంది. కొట్టినా బాధపడదు. కానీ నేను భోజనం మానేస్తే యేడుస్తుంది. ఊరొదిలి వెళ్ళిపోతే యేడుస్తుంది.

అందుకే నేను దాన్ని యేడిపించాలంటే తిట్టను. కొట్టను. భోజనం మానేస్తాను. ఊరికి వెడతాను.

ఇప్పుడూ అలాగే ఊరికి బయలుదేరాను. కానీ యేం లాభం? ప్రయాణం మొదట్లోనే బెడిసికొట్టింది.

వెంటనే ఇంటికెళ్ళిపోతే దానికి నన్ను చూసిన సంతోషం కలుగుతుంది. అది నా కిష్టంలేదు. కానీ తనువు విశ్రాంతి కోరుతోంది. దోసెలుతిన్న కడుపు-కిళ్ళీ నమిలిన నోరు.... త్వరగా ఇల్లుచేరి నడుంవాల్చమని ప్రోత్సహిస్తున్నాయి.

ఇంటికి నడిచే బయల్దేరాను. బస్టాండునించి మా

యిల్లెంతో దూరంలేదు. పది నిముషాల నడక-అంతే!

ఈరోజు కాస్త నెమ్మదిగా నడిచాను. అయినా పదిహేను నిముషాలే పట్టింది.

ఇల్లొచ్చేసింది.

వీధి తలుపులు గడియవేసి లేవు. ఓరగా తెరచి ఉన్నాయి.

అమ్మయ్య-దాన్ని తిట్టడానికి వస్తూనే మంచి అవకాశం దొరికింది. తలుపులు బార్లా తెరిచి వదిలేస్తుందా? ఇంట్లో నేను కూడా లేనే! అంత రాచకార్యమేం తగులడింది?

అయినా దాన్ని తిట్టి యేం లాభం? ఎన్ని తిట్టినా నవ్వుతుంది. రాత్రికి భోంచేయనని చెప్పాలి. అందులోనూ ప్రస్తుతం కడుపుపోటుగా ఉంది. కాసేపు దాన్ని యేడిపించి యేడిపించి నిజంగా నా ఆకలివేశాక అప్పుడే తినొచ్చు.

తలుపు తోసుకుని లోపలకు వెళ్లాను. ముందుతలుపు గడియవేశాను. దాన్ని తట్టేముందు తలుపులపట్ల నాకున్న శ్రద్ధ నిరూపించుకోవాలికదా!

నేను వచ్చినట్లు దానికి తెలియకూడదు. అదేం చేస్తోందో నేను చూడాలి!

ఇలాంటి అవకాశం నాకెప్పుడూ రాలేదు. అనుకోకుండా ఆఫీసుకు సెలవొచ్చినా, యేదో అవాంతరంవచ్చి పని వాయిదా పడిపోయినా-నేనెప్పుడూ వెంటనే ఇంటికి వెళ్ళేవాణ్నికాను. స్నేహితులతోనో, మరో విధంగానో సరదాగా గడిపి-ఇంటికి మాత్రం మామూలుగానో, వేళతప్పో వెళ్ళేవాణ్ని.

తలుపులు తట్టకుండా ఇంట్లో ప్రవేశించే అవకాశం

కూడా ఈ రోజే నాకు ప్రథమంగా లభించింది.

ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలను కున్నాను. అడుగులో అడుగువేసుకుంటూ వంటింటివైపు వెళ్ళాను.

నా ఇల్లాలు సీత వంటింటి పక్షి! గిన్నెలు తోముతూనో, చింతపండులో గింజలు తీస్తూనో కూర్చోడం దాని హాబీ. మొగుడితో సరదాగా బెడ్రూంలో పడుకోవాలనిగానీ, మొగుడు లేనప్పుడు పడకగదిని అందంగా తీర్చిదిద్దాలని కానీ దాని బుద్ధికి తోచలేదు. అందుకే అది బెడ్రూంలోకి వస్తే నాకు కంటగింపు.

కాని ఇప్పుడు సీత వంటింట్లో లేదు.

నేనీసారి స్టోర్ రూంలోకి వెళ్ళాను. అక్కడ వస్తువులను రోజూ మార్చి సర్దుతుంటుంది సీత. కానీ ఈ రోజది అక్కడా లేదు.

మా యిల్లు కాస్త పెద్దది. అంత పెద్ద ఇంట్లో మేమిద్దరమే ఉంటున్నాం. పెళ్ళయి మూడేళ్ళు దాటింది. ఇంకా పిల్లలులేరు. అదీ ఒకందుకు మంచిదే అయింది. పిల్లలు పుడితే ఇప్పటికే అదోలా వున్న సీత అసహ్యంగా కూడా అయిపోతుంది. ఇప్పుడైతే దాన్ని ఎలాగో భరిస్తున్నాను. అప్పుడు భరించలేను.

పడకగదికి బయల్దేరాను.

అడుగులు నెమ్మదిగా వేస్తున్నాను.

చప్పుడు కాకుండా పిల్లిలా నడుస్తున్నాను.

ఇక్కడ కూడా సీత వుంటుందా, వుండదా? అయినా ఇంట్లో బొత్తిగా అలికిడి లేదేమిటి?

పడకగది సమీపించేసరికి కాస్త అలికిడి వినబడింది. అమ్మయ్య అనుకుని తేలికగా నిట్టూర్చాను. ఇల్లు ఇంత

నిశ్శబ్దంగా వుంటే—వంటింట్లోనూ, స్టోర్ రూంలోనూ సీత లేకపోతే—అది బహుశా ఎక్కడికో బైటకు వెళ్ళి ఉంటుందనీ—దొంగ ఎవడో యింట్లో ప్రవేశించి వుంటాడనీ భయం వేసింది. పడకగదిలో అలికిడి వినగానే నాకు కలిగిన తృప్తి ఇంతా అంతా కాదు. ఆ అలికిడి సీత చేయిది. ఆ చేతిని ఎప్పుడూ నిండుగా గాజులుంటాయి. అది కాస్త కదిలినా అవి గలగలలాడుతూంటాయి. గాజుల గలగల ఆగకుండా వినబడుతూనే వుంది.

ఏం చేస్తోంది గదిలో సీత? గాజుల గలగల అంత ఎక్కువగా ఉందేం?

గుమ్మంలోంచి తొంగి చూశాను.

అక్కడ నేను చూసిన దృశ్యం నన్ను నిశ్చేష్టుణ్ని చేసింది. సీతా—అని గట్టిగా అరవాలనుకున్నానుకానీ గొంతు పెగలలేదు. పెదవులు కదలలేదు.

మంచంమీద సీత, మరో పురుషుడు నగ్నంగా ఒకరి నొకరు వాటేసుకుని వున్నారు.

ఇది నేనూహించని సన్నివేశం!

సీత చేతిని గాజులున్నాయి కాబట్టి చప్పుడవుతోంది.

నేను గుమ్మంలోకి వెళ్ళి నిలబడ్డాను. నా నీడ వారిని తాకిందో ఏమో ఇద్దరూ ఉలిక్కిపడి నాకేసి చూశారు.

"సీతా!" అంటూ అప్రయత్నంగా అరిచాను.

వాడు చటుక్కున లేచి నిలబడ్డాడు. మంచం పక్కగా వున్న లుంగీతీసి చుట్టబెట్టుకున్నాడు. నేను చూస్తూండగానే మంచంమీది పరుపు కాస్త కదిపి—అడుగున చేయి పెట్టి కత్తి ఒకటి తీసి—నాకు చూపించి బెదిరిస్తూ—"అరవకు. అరిస్తే చస్తావు—" అన్నాడు.

సీత మాత్రం మంచంమీద అలాగే కదలకుండా

పడుకుని నా వంకా, వాడి వంకా మార్చి మార్చి చూస్తోంది. నగ్నంగా వున్న తన శరీరాన్ని కప్పుకు నేందుకు కూడా ఆమె ప్రయత్నించడంలేదు.

“ఎవర్నువ్వు?” అన్నాను.

“దొంగని. డబ్బు దోచుకుందామని వచ్చాను. కానీ అంతకన్న విలువైనదే దొరికింది—” అన్నాడు వాడు. తర్వాత వాడు సీతను ఆజ్ఞాపించి నా రెండు చేతులూ వెనక్కి విరిచి కట్టించాడు. కాళ్ళు కూడా కట్టించాడు.

“ఇంక ఉంటాను మరి—గుడ్ బై మిస్టర్ .... థాంక్యూ సీతా!” అని వెళ్ళిపోయాడు వాడు.

అప్పుడు సీత బట్టలు కట్టుకుంది.

## 2

“ఎవరు వాడు?” తీవ్రంగా అడిగాను.

“తెలియదు. నేను వంటింట్లో పని చేసుకుంటుండగా బయటనుంచి వీధి తలుపు గెడ తీసుకుని వచ్చాడు. నన్ను బెదిరించి లోబర్చుకున్నాడు—” అంది సీత.

“బెదిరిస్తే లొంగిపోవడమేనా? వాణ్ని ప్రతిఘటించవద్దూ—బరితెగించిన ముండా!” అని తట్టాను.

సీత నవ్వింది. నేనెప్పుడు తిట్టినా అది నవ్వుతుంది—

“ఇప్పుడు మీరేంచేశారు చెప్పండి. నేను మీ చేతికి కట్లు కడితే చూస్తూ ఊరుకున్నారు కదా!”

కత్తిని చూసి నేను భయపడ్డాను. నిజమే! కానీ నేను మగవాణ్ని. నా ప్రాణాలు అమూల్యం. మరి సీత? అది ఆడది—దానికి ప్రాణంకంటె మానమే ముఖ్యం!—అదే చెప్పాను దానికి.

“మీరు చెప్పింది నిజమేనండీ. వాడు కత్తి చూపించినప్పుడా విషయం గుర్తుకు రాలేదు. ఈసారెప్పుడైనా

